





శ్రీ

# చిత్రాకుంతలము



గ్రంథకర్త.

నాదెండ్ల రామకవి

వెల 0—12—0.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# చిత్రకుంతలము.




కమ్మవంశాలంకారుఁడగు

నాదెండ్ల రామకవిచే

రచియింపఁబడి,

రామకృష్ణ సుబ్రహ్మణ్యకవిచే

పరిష్కరింపబడినది.



500 కాపీలు.

విజయ ముద్రాక్షరశాల, బాపట్ల.




[వెల 0—12—0.

# పీఠిక.

చదువరులారా,

ఈకవి "చిత్రశాకుంతల"మను పేర నీనాటకమును రచించుటకు మిత్రరత్నముల ప్రేరణమే ముఖ్యకారణము. ఇది కాళిదాస శాకుంతల ననుకరింపక భారతకథానుసారముగా రచింపఁబడెను. ఈతని రచనయందిదియే ప్రథమనాటకము. అదియుఁగాక సంస్కృతభాషయందుగాని, యాంధ్రభాషయందుగాని ఛందోవ్యాకరణాది నిబంధనలయందుగాని లేశమైన సామర్థ్యములేని యీతఁడీనాటకము వ్రాయఁగడఁగుట తప్పనక తప్పదు; గాని,

చ॥ పలువురు సత్కవిత్వమది ♦ బాల్పడకుండిన కొన్ని పుస్తకం
బుల రచియించి సిగ్గిలక ♦ మోదమునందుట తప్పుగాదు పు
త్రులు దనకుద్భవించినఁ గు ♦ రూపులుగాఁగలరందు భార్యతోఁ
గలయకమానునే? సుతులఁ ♦ గాంచకయుండునె? రూపహీనుఁడున్"॥

అని తిరుపతి వేంకటకవులు నుడివిన వడువున నొక్కొక్కఁడు దనశక్తికొలఁది గ్రంథరచనకు గడంగుట తప్పుగాదు. గాన దీనియందెన్ని దోసములున్న నీసడించి గుణములనే ఘనములుగా గ్రహించి యీకవికి మఱికొన్ని పొత్తముల వ్రాయఁ బ్రోత్సాహ మొనరింతురు గాక యని మా ప్రార్థన. దీనిని కృతిపరిచయులమగుటచే మాకొకతఱి వినుపింపఁ దోచినంతవరకందందు సవరించితిమి "ప్రమాదో ధీమతామపి" యని మాచేనొకవేళఁ బొరపాటున విడువఁబడినపట్ల జాగరూకులై గమనించి పండితులు దోషముల నీకవికెఱుకపరచిన బునర్ముద్రణమున సవరించుకొనుటకు సంసిద్ధుఁడై యున్నాఁడు. ఈతని నాటకరచనమునకు చాలావరకు దోడ్పడిన బాలకవి మ. రా. రా. శ్రీ వఝ. శివయ్యగారికిని మ. రా. రా. శ్రీ నాదెండ్ల రామకవి గారికిని పరమేశ్వరుండాయురారోగ్యము లొసంగి రక్షించుగాత.

ఇట్లు

గొరావఝ్ఝల రామకృష్ణశాస్త్రి,
అక్కపెద్ది సుబ్రహ్మణ్య శాస్త్రి,
ఆశుకవులు, శతావధానులు.

# ఈనాటకమునందలివచ్చు పాత్రలు.

## — పురుషులు. —

| | | |
|---|---|---|
| 1. | ఇంద్రుఁడు— | సురరాజు. |
| 2 | బృహస్పతి— | దేవగురువు. |
| 3. | విశ్వామిత్రుఁడు— | ముని. |
| 4. | కణ్వుఁడు— | కథానాయికకు తండ్రి. |
| 5. | 1 శిష్యుఁడు | కణ్వుని శిష్యులు. |
| 6. | 2 శిష్యుఁడు | |
| 7. | 3 శిష్యుఁడు | |
| 8. | దుష్యంతుఁడు— | కథానాయకుఁడు. |
| 9. | సుధర్ముఁడు— | దుష్యంతుని మంత్రి. |
| 10. | భరతుఁడు— | దుష్యంతుని కుమారుఁడు. |
| 11. | కౌండిన్యుఁడు | మునులు. |
| 12. | భారద్వాజుఁడు | |

## — స్త్రీలు. —

| | | |
|---|---|---|
| 1. | శకుంతల— | కథానాయిక. |
| 2. | మేనక— | దేవవేశ్య. |



శ్రీరస్తు.

# చిత్రశాకుంతల నాటకము.

(నాంది)

ఉ॥ శ్రీలకు బుట్టినిల్లగుచు • జెన్నలరారెడు వెండికొండపై
మేలిమి జాళువా పసిడి • మేడను గాఁగిటఁ గాఁ జేర్చి భ
క్తాళిఁ గృపాకటాక్ష విభ • వాతిశయంబులఁ గాంచిప్రోచు ధీ
శాలి త్రిలోకపూజితుఁడు • శంకరుఁడీయుత మీకు భద్రముల్.

అనుబంధము (1) (2)

సూత్ర—(నాంద్యంతమునఁ బ్రవేశించి తెరవైపు జూచి) ఆహా! కాలమతిక్రమించినను నటి యింకను రాకయున్నది. అబ్బా! కామినులు సమయాసమయములు తెలియఁగక కాలయాపన మొనరించుచుందురు. ఐననొకతూరి పిలచిచూచెద, ప్రేయసీ! "సింగారించులోపల బట్టముకొల్లబోవు" అను గతిజేయక సత్వరమేగుదెంచుము.

అనుబంధము. (3)

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్ర! ఏలయింత తొందరపడెదరు.

సూ-కామినీ! ఇంతకాలమే భూషణములచే భూషితురాలవగుచుంటివి.

నటి—నాథ! కురులనువ్వుటయు, కొప్పుముడుచుటయు, కనుల కాటుక దిద్దుటయుఁ దప్ప నగలవలని వగలఁగులుకు భాగ్యమునకే నోచనైతిగదా?

సూత్ర—తలోదరీ!

గీ॥ సహజ సౌందర్యవతులగు • చానలకును
భూషణంబులు లేకున్నఁ • బోదుసొగసు

కాననంబునజన్మించి • మౌనివరుల
యాశ్రమనివాసమొనరించు • నతివలటుల ॥

నటి — ఆర్యపుత్ర! సుందరమౌ మాటనుడివితివి. మున్ను శాకుంతల భూషణాహీనయయ్యు సహజ సౌందర్యముచే దుష్యంత భూకాంతునకు పట్టమహిషియయ్యె.

సూ — మేలు మేలు సమయమునకు దగినమాటనుడివితివి ఇంతకొక్కింత పూర్వము సభ్యులు నన్నారసి "శృంగార రసప్రధానమగు చిత్రశాకుంతల నాటకప్రదర్శనచే మాడెందంబుల నానందపెట్టుండు" ని కోర నిన్నుబిలచి మాటలసందడిచే మఱచితి. దానికి దగు పాత్రల నాయత్తపఱపుము.

నటి — ప్రియవల్లభ! యద్దాని రచించినవా రెవరు.

సూ — కామినీ!

సీ॥ నాదెండ్లవంశచంద్రముడౌ రామస్వామి
సీతమాంబిక యవ్వ • తాతలగుచు
నిరతాన్నదాన స • చ్చరితుండు యల్లమం
దయ తన్నుఁగన్న తం • డ్రియగుచు
పతివ్రతభక్తి సం • భరిత వెంకమ్మ యు
త్తమురాలు సాధ్వియే • తల్లియగుచు
అపరమహాలక్ష్మి • యనఁదగు నారాయ
ణమ్మయే తనముద్దు • కొమ్మయగుచు
గీ॥ ఆంధ్రకవితావిలాసిని • యనెడు చెలిని
స్వయముగా వరియించిన • సరసమూర్తి
కమ్మకులజుఁడు రామయ • కవివరుండు
"చిత్రశాకుంతల"మనంగఁ • జేసెదీని॥

నటి — (నవ్వుచు) నాథ! ఈనాటకము మనమేమని ప్రదర్శింతుము.

ఉ॥ చేరినసభ్యులారసికశేఖరులీకథ యెంతయేని స్వం
గారరసప్రధానము; దీని గాకననే బుధుల్ రచించిరే
తీరునసున్నె; నీకవియు దీనిని వ్రాయ కతంబదేమి? యె
వ్వారలు మెచ్చువారు మనవారు బదిగ్గునఁ జేయనియ్యెడన్ ॥

సూ.—కాంత! అట్టులెవ్వరికిని దలంపకుము. పరమేశ్వరుండెవని కెంత తెలివినొసంగునో యంతియె కవిత్వము నెవ్వరికిలేదు. వానిని గని పండితులైనవారు సర్వపుష్పంబుల గంధసీక మకరందపానమొనర్చు మత్తాళింబోలె రసాస్వాదన మొనర్చెదరు.

నటి—ఆర్య! కాలవిలంబమునకు సభ్యులనుమతింపరు. మీరు మాత్రము జాగరూకులై మెలంగ గోరెద

సూ—మానిని! అనుకూలమునవచ్చు విఘ్నములకు వెఱచియు సుమూపదేశమున సుఖించు దేవేంద్రునిబోలె (అనునర్ధోక్తిలో)

(తెరలో)

నిజము. నిజము ఆర్యపుత్ర! ప్రస్తుతము మాయవస్త్రయుక్తయున్నది.

నటి—(వినుటనటించి) నాథ! ఎవరీపురుషుఁడు.

సూ—కాంత! దేవేంద్రునిమానముచేఁగాఁబోలు నీతమ్ముఁడు దేవేంద్రవేషధారియై విశ్వామిత్రి తపోభంగప్రయత్నమూహించుచు వచ్చుచున్నాఁడు. మనమనంతకరణీయముల నారయఁబోవుదము రమ్ము.

నటి—చిత్తము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.





# చిత్రాకుంతల నాటకము.

## ప్రథమాంకము.

### 1 వ రంగము.

స్వర్గపట్టణము (ప్రవేశము ఇంద్రుడు బృహస్పతి)

ఇంద్రు—ఆచార్య! ఈస్వర్గాధిపత్యము వహించినదాది పడరాని పెక్కిడుములఁబడియు భవదనుగ్రహంబుచే సూర్యోదయంబుచేఁ జెదరు తమఃపటలంబు చందంబున నాపదలఁబాసి క్షేమంబుగా నుండఁగలిగితిమి

బృహ—పాకశాసన! దైవానుగ్రహమున్న నెట్టియిక్కట్టులువచ్చిన నేమిజేయుఁగలవు? కానినేఁడేమో దీనుఁడవై కనుపట్టుచున్నాఁడవు

అనుబంధము. (4)

ఇంద్రు- మీబోటివారాస్థానవాసులై యుండ మాకేటిచింతగలుగును

బృహ—నీవులేదనినను నీముఖారవిందము వాడుటయే సూచించుచున్నది.

ఇంద్రు—సూచించునదేమున్నది? ఈస్వర్గాధిపత్య మెప్పుడునైకొంటినో నాటినుండి యేదోచిక్కులుచేఁ గుందుచుంటయేఁగాని సుఖంబొక్కనాఁడెరుంగనుగదా!

బృహ—ఇపుడేమి విపరీతము సంభవించినది

ఇంద్రు—ఏమున్నది? ఇటువినుఁడు

గీ॥ కౌశికమునీంద్రుఁడడవిలోఁ గమలనాభు
నెమ్మనంబున నెంచి తపమ్ము సేయు
చున్నవాఁడాతని తపంబు నాఁగి వినాశ
నమ్ము జేసెదు పని సెలవిమ్ము దేవ? ॥

గాధిపుత్రుండు ఘోరారణ్యమునఁ దపంబొనరించుచుండె. యాతపోవేడిమి యీస్వర్గమెల్ల దహించుచుండెఁ గాన దేవతలా బాధలకు దాళఁజాలక మొరలిడుచున్నారు ఇందునకేయుపాయము దోఁచకున్నది.

బృహ—బృందారకవందిత చరణేందీవర! పురందర! ఈభాగ్యమున కింత యోచింపనేల? ఇదివరకెందఱో తపంబుల నిదివరకాచరించిరి వారందరు మనయచ్చరల కౌఁగిళ్ళఁ బట్టువడి మారుకేళిఁ బెనంగిరి మనవారాంగనలలో వాసిఁగాంచిన మేనకనుబిలచి యాబోడి తపసిని గూడుమనుము తదుపరి మనకష్టంబులు దొలఁగును.

ఇంద్రు—గురువర! మంచియుక్తిఁ బన్నితిరి అటులనే జేయువాఁడ ఓరీ! సేవక! మనపడుకత్తెయగు మేనకను దోడ్కొనిరమ్ము.

సేవ—చిత్తము (నిష్క్రమించును)

బృహ—దేవేంద్ర! నాకనుష్ఠానకాలం బాసన్నమైనది నేనేఁగెద. (నిష్క్రమించును)

సేవ—(ప్రవేశించి) దేవ! మేనక చనుదెంచినది

ఇంద్రు—మంచిది లోనఁ బ్రవేశఁబెట్టుము (అనుబంధము 5 6)

మేనక—(ప్రవేశించి) సురవినుతచరణా! గిరిగర్వహరణ! శచీరమణ! జోహార్ జోహార్!

ఇంద్రు—కల్యాణీ! సుఖివై కృతార్థురాలవుగమ్ము

మేన—సురరాజ! కీర్తియుతలగు ధనాంగనలుండ నోరపాటిదాననగు నన్నేలఁ బిలువనంపితిరి

ఇంద్రు—జవ్వని! అందరితో నొకమాటు పనియేముండును

మేన—తమానుగ్రహ పాత్రురాలనగుకతన నాకొక్కలోపంబుండదు

ఇంద్రు—ఇపుడుకావలసిన కార్యంబైనఁగదా? నాయందునీకుదయ నీయందునాకుదయ

మేన—దేవరవారి యాజ్ఞచొప్పున నదియెట్టిదైనఁ జేయుటకు సిద్ధము గానున్నదాన

ఇంద్రు—అలాగైన సంతోషమేగదా? కాంత! నిక్కముగా నెరవేర్చెదవుగదా? చెప్పినవెనుకఁ దప్పిననొప్పకొనను

మేన—భవదాజ్ఞమీరుదునా?

ఇంద్రు—వినవినుము బ్రహ్మర్షినామము బడసియున్న గాధిపుత్రుండు విశ్వామిత్రుండు నీహార శైలాటవీప్రాంతంబుల ఘోరతపంబుజేయుచున్నాఁడు నీవాబోడికిపసి పోడిమిమూన్పి కాముకేళిఁదేలించి నీబానిసననిపించుకొని తపోవిఘ్నంబొనర్చి విటకులాగ్రేసరుడనిపించుము. (7 అనుబంధము)

మేన—సురనాథ!

చ॥ వనజభవప్రభావుఁడగు వానివశిష్ఠు నపత్యశోకమున్
వననిధిలోనముంచి నయవారితసత్త్వుఁడు నిన్నుదొట్టియా
యనిమిషులెల్లవానికి భయంపడుచుండెదరట్టి యుగ్రకో
పనుకడకిప్పుడేగుమనఁ బాడియె? నీకుశచీమనోహరా? ॥

మఱియు,

ఉ॥ ఆమ్మునిఁజూల్కిగన్గొనఁ దయంతటిలోనన భూమిధారుణీ
ధ్రమ్ములువ్రయ్యు; నయ్యు సుమపక్కఁగనంబుధులింకు; మూడులో
కమ్ములు దద్దిరందిరుగు; గామ్పచలింపగనోడు నిద్దినా
యమ్మగునే? బలారి! యిటులంగనలన్ మునిచెంతకంపుటల్ ॥

(తనలో) అక్కటా! పరమతపోనిష్ఠాగరిష్ఠుఁడై, ప్రత్యగ్బ్రహ్మైక్య సంధానుఁడై నిరాహారుఁడై అరిషడ్వర్గములకజేయుఁడై యుండు విశ్వామిత్రుఁడేడ? నేనేడ? నక్కనును దేవలోకమున కెక్కడి

సాధ్యము కానిమ్ము పోవనోపనిన బలారిదండనమునఁ బోయినచో మునిశాపంబువలనఁ బ్రాణంబులు పోవును యేమైనను రాజునానతి మీరఁగరాదుగద (ప్రకాశము) దేవా పురందర!

గీ॥ తనువు మఱచిన వారిలోఁ దగవుగాదు
తపసినేత్రాగ్ని చేనేను దహనముగుట
నిజము నాచావు నిదవు నేఁటిదినమె
యిట్టికార్యంబు నాచేత నెట్టులగును॥

దేవ! మున్ను తమవంపునఁ గైలాసమున కేగిన శివునిచే మారునకే విజయమైనదో నాకావిజయము ప్రాప్తింపనయ్యెను భవదీయ కరుణాకటాక్ష వీక్షణాలంకార పాత్రురాలనగు నాకాశాపంబు బొసంగకుండ జయంబగునట్లాశీర్వదింపుము కనికరింపుము, బంపుము నేఁబోయివచ్చెద.

ఇంద్రు— మేనక! సుందరమగు నీవదనారవింద సందర్శనమున నీ మునిపురందరుఁడు గాఁగిలినంద డెందంబునఁ దొందరపడఁడు? పోయిరమ్ము నీకుజయంబగుగాక.

మేనక— దేవరయానతిఁ దలఁదాల్చితి నమస్కారము.

(నిష్క్రమించును,)

ఇంద్రు— మేనకకు దోడుగా వసంత కీరశారికాకలరవ పరభృతాదులఁ బంపెద.

(నిష్క్రమించును)

ఇది ప్రథమాంకము



శ్రీరస్తు.

# చిత్రశాకుంతల నాటకము.

## ద్వితీయాంకము.

### 1 వ రంగము.

(అరణ్యము మేనక, సుందరీ ప్రవేశము.)

(కి అనుబంధము.)

మేన—సుందరీ! దీనికి నేనేమిసేతును.

గీ॥ చేయఁజాలనన్న శిక్షించు నింద్రుఁడింపు
జేతునన్న ముని యజేయుఁడయ్యె
నేమిసేయుదాన నేరీతిఁజనుదాన
నూయిముందు వెనుక గోయియయ్యె॥

నెచ్చెలి! సుందరీ! దీనికెద్దియేని సముపాయమున్న నూహింపుము.

సుంద—అమ్మా! ఉపాయమేమున్నది? దేవేంద్రునానతిమీర దేవతలకైన నందరమా? స్వామివారి యుంపుడుకత్తెలకేఁ జెప్పవలసినదేమున్నది? మీకుఁదెలియనిదేమి?

మేన—కాంత! ఏమీ యీమౌని తపోవనరామణీయకము.

గీ॥ కలకలనినాదమొనరించు చిలుకగములు
కోయనుచుగూయు నీగండు కోయిలలును
గాంచుమీ ఋషితపము వర్ణించుచున్న
కరణి వీనులవిందుగాఁ బరగుచుండె॥

యిఁకఁ దడవుసేయక విశ్వామిత్రుని డాయుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

### 2 వ రంగము.

విశ్వామిత్రాశ్రమము

(విశ్వామిత్రుడు తపముజేయుచుండును మేనక సుందరి ప్రవేశింతురు)

మేన — ఇదియే కాఁబోలు విశ్వామిత్రతపోవనము. అయ్యారే! ఏమీ యౌవన రామణీయకము అల్లిబిల్లిగా నల్లిన లతావితానములచే నెండకన్నెరుఁగనీయక నల్లెడల శీతలచ్ఛాయల నీను తరువరశాఖాసమూహముచే ఫలకిసలయకుసుమముల మెసవి స్వేచ్ఛారీతి సంచరించెడు విహంగదంపతులచే నెద్దివసంతమో యెద్దిహేమంతమో దెలియరాకున్నయది.

సుంద — (చూచుచు) ఆకనుపించునాతఁడే కాఁబోలు విశ్వామిత్రుఁడు

మేన — నాకునట్లే తోఁచెడు (కొంచెమాలోచించి) అమ్మో! ఇట్లువ విష్టుండై తదేకనిష్ఠాగరిష్ఠుఁడై తపముజేయుచున్న నీమహానీయుని నేనేరీతి గవయుదాన ఐననాశక్తికొలఁది నభినయ నృత్య గీతములచే నాకులోనగునట్లు చేయుదాన. (గేయము)

విశ్వా — (కొంచెము కన్నెత్తిచూచి) ఆహా! ఏమి? నాధ్యానముద్ర వదలిపోయెడు.

చ॥ ప్రళయతపోగ్నికీలలటు • పర్వఁ జచ్చెదమంచు సోకుమూ
కలు వెఱగందు; దేవతలు • కన్నులఁ జూడరు పక్షిజాలముల్
మెలఁగవుమింట; నిట్టిదఁట • లింపక మౌనముదాల్చియున్న నా
తలఁపున కేలవచ్చెను ని•తంబిని దివ్యవిలాసవిభ్రముల్ ॥

ఇప్పుడు నావడలిమీఁదఁ జల్లని పిల్లతెమ్మెరలు మెల్లఁగా వీవఁదొడఁగె నేఁడేమిది.

చ॥ అనిమిషకాంత యొక్కతె వ•నాంతమునందు చరించినట్లు న
న్గనుఁగొనినట్లు కౌఁగిలిడఁ•గా గమకించినయట్లు కేళిలోఁ
బెనఁగినయట్లు, నామదిని • వేమరుఁ గోరిక లూరసాగె నా
ఘనతరయోగ నిశ్చలత • గన్పడదయ్యెను బూర్వమట్టులన్ ॥

ఏమిది చిత్తము చిత్తకాయత్తంబయ్యె దీనికిఁ దగుకారణంబేమై యుండును. (చూచి) అదిగో ఆకనుపట్టుచున్న మనోహారిణి యెవతెయై యుండనోపెడు. చూఁగఁజూడ మానవాంగనగతి గనుపింపదు.

చ॥ నడచినఁ గందిపోవు చరణంబులటంచును మెల్లమెల్లఁగా
నడచెదు; మాటలాడ రతనంబులు రాలునటంచు నేమొ ప
ల్కడదు; కుచాగ్రసీమ నొకయించుకపయ్యెద కొంగుజారిన
య్యెడ విహరించు నా కులుకులాడి మిటారి తలంప నెవ్వతో ॥

కొంచెయు,

సీ॥ కమలాసనునితోడఁ గలహించి విచ్చిన
వాణినాఁ దనరు నా వారిజాక్షి
వెన్నునుబాసి పృథ్వికి వచ్చు లచ్చియో
యనఁదోచుచుండెఁ గంజవదన
సపతిపోరునఁ బసఁ జాలక హరు వీడి
వచ్చిన గౌరినా వగలునతిప
పాకశాసను బాసి లోకముల్ గనవచ్చు
పౌలోమియన నొప్పె నీలతాంగి
గీ॥ మేఘమాలలోన మెఱుఁపుతీగ యనంగ
మెచ్చఁదగిన యడవి లచ్చి యనఁగ
నా తపఃఫలంబు నాయోగ్యమన్నదీ
కలికి యెవరో నాకుఁ దెలియదయ్యె ॥

అబలామణియయ్యు నీభీకరారణ్యమున నిర్భయముగా సంచరించెను (నిదానించి చూచి) నా సమీపమునకు రానిచ్చగించియు రానొల్లకున్నట్లున్నది అయ్యారే!

గీ॥ సూనశరహాలికుఁడు చెలి చూపులనెడు
నాగటను మామకీన మనంబు భూమి
గాఁ గదున్నియు ననురాగ ఘనరసంబు
బోసి మోహాంకురంబును బూనినాఁడె ॥

కానిమ్ము నేనింతలో నింతపొరపాటు బడరాదు. ఛీ! ఛీ! పాడుమోహమా ఎంతలో నావరించితివి ఓ హృషీకసర్వాంగములార! నా మనవి నాలింపుడు.

సీ॥ ఒంటిగానున్న వా♦ల్గంటిసోయగమును
గాంచఁగఁబోకుఁడీ♦కన్నులార!
వట్టిమాత్రికుదివ్రుళ్ళు♦బెట్టఁబాడినగాని
వినఁదలంపకుఁడయ్య♦వీనులార!
పలుమరువచ్చితా♦బతిమలాడినగాని
గడియంగఁబోకుఁడీ♦కరములార!
అందుండి కాంత ర♦మ్మని కన్నుగీటినఁ
బైనంబుగాకుఁడీ♦పదములార!
గీ॥ ఆపదలు పెక్కుకోటులే♦నలముకొనిన
నంతయుచలింపకీగాధి♦సూను యశము
తరుగనీయకుమమ్మ. ది♦త్రంబనీవు
కోరి యీరీతి మిము వేఁడు♦కొనెదువాఁడ॥
నాకేలయీగొడవ నాపనిమీఁదనేఁగూర్చొనెద.
(అని కనులుమూసి కూర్చుండును.)

మేన — సుందరీ! విశ్వామిత్రుండు మనవంకఁజూడియు చనుదేరక కూర్చుండెనేల.

సుంద — అదియొకబెట్టు

మేన — బెట్టేమి?

సుంద — ఇందరు నీవలెనేయుందురా?

మేన — ఏవిషయమున

సుంద — పురుషులమోహించి చనుదెంచుటయందు

మేన — ఎంతవాచాలతగలదానవే

సుంద — నావాచాలతకు నీమనసుమెత్తనయే కారణము.

మేన — ఇటులాడిన మర్యాదదక్కదుసుమా!

సుంద — నామర్యాదకేమిగాని నీమర్యాద విశ్వామిత్రునికడఁ గాపాడుకొనుము.

మేన — ఓసి! మూర్ఖురాల!

సుంద—మూర్ఖురాలనుగానున్న నేనింతదవ్వరుదెంతునా ?

మేన—చాలునీకుఁ గట్టిపెట్టుము.

సుం—విశ్వామిత్రుఁడే బాహులతికలఁ గట్టఁగలఁడు

మేన—అటులైనఁ గృతకృత్యలమే చెంతకేఁగి యొక్కింత విలాసము జూపుదమురమ్మా (విశ్వామిత్రుదరిఁజేరి)

చ॥ లలితరసాలపల్లవము♦లన్ దెగమెక్కి వసంతవేళలో
ఖలయలపంచమశ్రుతిని♦దే పలుకాడేఁమునీంద్రులేర! కా
నలవిడనాడి కాంతల న♦నంగరణావనిఁ గేల్చి మోవితే
నెలఁ జవిఁజూడు,,డంచుఁగమ♦నించినవారుగృహంబుఁ జేరఁగన్

గానంబుపాడినను చలింపఁడయ్యె కానిమ్ము కొంతవడి యీపొదరింట డాగుదమురమ్మా (ఇరువురటులఁజేయుదురు)

విశ్వా—నేను బెట్టుగనుంటినని కాఁబోలు వారు మాటలాడకనే వెడలిరి. కానిమ్ము నేనే ముందుమాటలాడించెద (మేనకనుడాసి) మోహనాంగి! ఎలడాగెదవు నీపేరెయ్యది? తపోవనంబునకు రాఁగశంబేమి? ఇందు వంటరివై యుండఁగతంబేమి? నీచరిత్రమంతయు దాచక విశదీకరింపుము.

మేన-(మెల్లఁగాఁబొదరిల్లువెడలి సిగ్గుచేఁ దలవంచుకొనును) (9అను.)

విశ్వా—ఓచెలీ! మన్మథుఁడు నీపై మోహముచే నామనస్సు నంతయు గలఁగఁజేయుచున్నాఁడు నీయుదంత మాద్యంతమెఱిఁగించి త్వరలోసుఖంబులిమ్ము లేనియెడల నాప్రాణంబులు నిల్చుటకష్టము

మేన—మీవంటి మహనీయులకు వేశ్యాభోగంబు లేల?

విశ్వా—తనకై కామించిన దోషమేమున్నది? జక్కవపక్షుల ధిక్కరించు నీకుచద్వయము నంటనిమ్ము.

మేన—మౌనివర్య! క్షణమాలోచింపుము. తొందరనందకుఁడు.

సీ॥ నిష్ఠచేజపియించు♦నీవంటియత్తులకీ
యల్పభోగంబం♦బాసలేల

విశ్వా—అల్పభోగమునకే♦యాశించియనుగుట
తప్పగానీమతిఁద♦లఁపఁబోకు

మేన—తప్పేమి? యీరీతిఁ దడయక పైఁబడి
పాపమనక స్త్రీలఁ బట్టఁబూన
విశ్వా—పాపమేమున్నది? భయపడకుమీ కాని
వేశ్యల భోగింప విధిసృజించె
మేన—గీ॥ ధర్మపరుఁడవు నీవిట్లు దలుపవలదు
విశ్వా— దలుపవలదని చెప్పిన కలతఁసిపుడే
మేన— కలయుదనిగట్టిగాఁ జెప్ప వలదు నీవు
విశ్వా— వలదు నీవని జెప్పఁగా వలదు తరుణి ॥

మేన—దేవ! తపోనిష్ఠాగరిష్ఠుండవై పరబ్రహ్మ స్వరూపుఁడవై యున్న నీవిట్లనుట న్యాయమా?

విశ్వా—కామిని! నిన్నుఁ గనుఁగొనినంతనే తపోభంగమయ్యె! ఇఁక నేను విటుఁడగాని జడదారినిగాను నీతోఁ గలయుటే నాకున్యాయము

మేన—గీ॥ ఇనుపగోచు బిగియించి యుంట్లవదలి
యన్నపానాదులును లేక యడవిలోన
నలపరబ్రహ్మ ధ్యానించు నట్టి దేవ
మునులకీబుద్ధి బుట్టుట ముఖ్యమగునే? ॥

విశ్వా—నీవెన్ని జెప్పినను తప్పక నీతో భోగించువాఁడ.

మేన—(తన) గీ॥ ఏకతంబునఁ బైఁగాలి సోకెనేని
యతివరేణ్యులు విటులయి యతనుకేళి
దేలబ్రతిమాలు చుందురీ లీలనెంత
ప్రజ్ఞగలవారు కాంతలీ వసుధయందు ॥

(ప్రకాశముగా) ఆర్య! క్షమింపుఁడు. నేనింతకాలము మిమ్ముబ్రతిమలాడఁ జేసితినని కోపింపకుఁడు, నిందింపకుఁడు, నేను మేనకను దేవలోకనివాసిని నిన్నుకామించి వచ్చితిని, మెచ్చితిని, నొచ్చితిని ఈమదనానలంబునఁ దాళఁజాల, నిలువఁజాల, నోర్వఁజాల రమ్ము. గౌఁగలిమ్ము మనసామ్రాజ్య పట్టాభిషిక్తుఁడవుగమ్ము.

విశ్వా—సుందరాంగి! అల్లిబిల్లిగానల్లిన మల్లెపూఁబొదరింట నించుక కాలము విశ్రమింతము రమ్ము (మెల్లఁగా నిరువురు నిష్క్రమింతురు)

## 2వ రంగము.

(సుందరి ప్రవేశము)

సుంద—ఆహాహా! ఏమీ మామేనకసామర్థ్యము బ్రహ్మవేత్తనని కాననంబున మునివృత్తి ముక్కుమూసికొనినవాని ముదివిటునిజేసినది యిట్టులేగదా యుండవలయును ఈకాలంబునసహితము దొంగవేదాంతములనేరిచి కూడుగుడ్డలేక సన్యాసులమని జందెముల ద్రెంచివైచి తలలుబోడిగుండ్లుఁ జేసుకొని సీరుకావిగుడ్డలఁగట్టి అమాయకుల గృహస్థుల యిండ్లఁజొచ్చి పొట్టబగలఁదినుచు పగలెల్ల వేదాంతులగనటించి ప్రొద్దుక్రుంకగనే విటంతులకడనో సువాసినులకడనో వేశ్యలకడనో వైశ్యాంగనలకడనో వేయేల యెవతెలభించిన దానికడనెల్ల గృహస్థధర్మమవలంభించెదరు. ఛీ! ఛీ! ఈపాపులోకమెంతకన్నులుగానిది. తెలివిలేనిది, విచారణహీనమైనది, వీరిమూలమున నికముందు బుట్టబోవువారికిని బుట్టినవారికి నిగూఢ దుర్యశములభించెడు తప్పదు, తప్పదు. నాకెందుకీగోడవ (చూచుచు) పావమావచ్చునది విశ్వామిత్రునేకాఁబోలు చింతాక్రాంతుఁడై యున్నాఁడేమి? ఆవచ్చునదెవరు మామేనకయా ఆవ్వడే యొకబాలికను గని దానిని విడనాడఁజాలక కాఁబోలు చింతించుచువచ్చుచున్నారు. వీరేమిజేసెదరో నేనాపొదరిండడాగి చూచెదను. (నిష్క్రమించును)

(విశ్వామిత్రుఁడును, బాలికనెత్తుకొని మేనకయు ప్రవేశింతురు)

విశ్వా—నాతపోభంగమొనర్చిన జగన్మోహిని! ఇటురమ్ము నాపాలి మృత్యుదేవత! నన్నెడబాసిపొమ్ము.

మేన—చాలుచాలు. బలవంతముగ నన్నుగదిసి మృత్యుతుల్యనొక్క బాలికనుగను గని నన్నుబొమ్మనిన నేఁబోఁజాల, ఈబాలికను జూచిన దేవలోకవాసులు నన్ను ఛీ యనెదరు. దీనినీకడనుంచుకొనికాపాడుము. నాకుసెలవిమ్ము.

వి-ఓసిక్రూరకర్మురాల! ఎంతజగజంతవేగయ్యాళివే? కడుపారగన్నపట్టని నట్టడవిసించిపోఁగాళ్లెట్లాడెనే? దేవవేశ్యలింతవారమేని యెరుంగనైతి.

మేన— మత్తకోకిల.

దేవవేశ్యలకేలబిడ్డలు • దేవనీవిఁకఁజెప్పమా
కావరంబుననిట్టిమాటలు • గాధిపుత్త్రక! చెల్లునే?
కావుమంచునువేఁడుదానను • గౌరవంబుననిన్ను నే
దేవతావిభు వీఁటికిప్పుడు • దేజమొప్పఁగఁబోయెదన్ ॥

ఇంతకాలమిటనుంటినని దేవవిభుఁకోపించెను, దూషించెను శపించెను. శిక్షించెను నీబాలిక నిటడించెదఁ గైకొనుము, (అని బాలికనందునిచి) ఇదేవెళ్ళుచున్నదాన. (నిష్క్రమించును)

విశ్వా— తపోభంగము జేయుటయేగాక నాపాలిటికి పెనురాకాసిఁ బోలె నీబాలికనుగని విడచిపోయెను. నేనెట్లుపోషించువాఁడ దీనిని యేమృగమైన తిన్నయెడల శిశుహత్య సంభవించును. ఆహా నాస్వాంతమునకెంత సంతాపమువాటిల్లెను. నేనేమిసేయువాఁడ.

గీ॥ భూమిలోపలనేనిట్లు • బుట్టనేల।
బుట్టినను మేనకనుబొంద • బూనుటేల
పొందినందట బాలిక • పొడమనేల
పొడమెబోయిందువిడనాడి • పోవనేల। (10 అనుబంధము.)

ఈశ్వరా! నన్నేలబుట్టించితివి బాలికనువిడచి మేనక దేవలోకమునకుబోయె నేనుతపోవనంబునకు వెళ్ళినచో నీబాలికగతియేమగును ఘోరమృగంబు లశనంబుజేసుకొనుదురు అప్పుడు నేనెంతటిపాపినౌదు కానిమ్ము మాలినీపులినతలంబునఁబెట్టి యొక్కయుపాయంబు వెదకెద. (కొంచమువిచారించి)

ఉ॥ బాలికనేమృగంబులును • పట్టకయుండెడుగాత పట్టినన్
జాలఁగవానివంశమును • జక్కఁగనొందెడు వేవినాశముల్
గాలియు నెండసోకనటు • గా దమఱెక్కలఁ గప్పితేనియల్
గ్రోలఁగనిచ్చిబ్రోచెడు శ • కుంతములంచిత ప్రేమదృక్కులన్॥

నాతపోమహిమచే శకుంతదంపతుల సృజించితి నవి నేఁజనిన వెంటనేవచ్చి ఈనిసువునుగాపాడఁగలవు నేఁబోయెద.

(నిష్క్రమించును.)

3 వ రంగము.

కణ్వాశ్రమ ప్రాంతారణ్యము (కణ్వుఁడు శిష్యులు ప్రవేశింతురు.)

కణ్వ—అంతేవాసులార! హోమార్థమునకువలయు సమిత్కుశఫలాదుల నాయత్తపరచితిరా

1 శిష్య—ఫలపుష్పాదులసంగతి మాకుబట్టలేదండి.

కణ్వ—అదియేమి

2 శిష్య—ఇచ్చట నొకచిత్రముగంటిమి

కణ్వ—అదేమిచిత్రము

1 శి—ఈమాలినీనదీతటంబున శకుంతరక్షితమై యొకబాలిక యున్నది

కణ్వ—ఏమీయాశ్చర్యము పోయిచూతమురండు

2 శిష్య—మునీంద్ర! ఈమార్గమునరండు (కొంతనడువ వెనుక తెఱ యెత్తఁబడును)

1 శి-దేవ! ఇదియేశకుంతరక్షితయగు బాలిక సదానించిపరీక్షింపుఁడు

కణ్వ—గీ॥ చెలఁగినేపనేర్పుఁ జిఱుతుకదాని గ్రు
వ్యాఘ్రదఘోరమృగములఁ గనబుద్ధి
బట్టుకుండఁ జెట్టుఁ పై నుంచిరక్షించు
కొని శకుంతతతులుఁ గూడియుండె॥

ఆహా! ఏమీ ఈబాలికచక్కఁదనము పాలకడలి నవతరించిన బాలశశిరేఖఁబోలియున్నది. ఈబాలికనీగతిఁజేసిన వారెంతకఠినహృదయులో నాయోగదృష్టివిచారించెద(ఆకసమువంకదృష్టినిలపి) ఆహా! తెలిసినది తెలిసినది గాధిపుత్రుండగు విశ్వామిత్రుఁడు మేనకతో భోగించి యీబాలికనుగని యీపనిజేసిచనెను. ఎంతటిసాహసము.

1 శిష్య—దేవ! యీబాలిక నేమిజేయుమనెదరు

కణ్వ—నవనవలాడు నీచిన్నికన్నియ మోముగన్నదాది నాకుపుత్రికావాంఛపొడఁజూపెను. ఇదశకుంతపక్షులచే రక్షింపఁబడినదిగాన "శా కుం త ల" యని యీబాలికకు నామంబిడితి. యింక మీరు జింకచర్మములో నాబాలికనునిచి యెత్తుకొనరండు

2 శిష్య—ఆలాగే! (అనియెత్తుకొని పోవుదురు) ఇది ద్వితీయాంకము.



శ్రీరస్తు.

# చిత్రశాకుంతల నాటకము.

## ద్వితీయాంకము.

### 1 వ రంగము.

దుష్యంతుని కొలువుకూటము.

(దుష్యంతుఁడు, సుధర్ముఁడు ప్రవేశింతురు)

దుష్య—అమాత్యశేఖర!

పంచచామరము॥ ధరామరుల్ నిరాశ నొందిః ధర్మమున్ గ్రహింతురే
ధరాధిపుల్ గ్రమంబు చేతః దాల్మినిస్తులిత్తురే
సరాగభోగయుక్తవైశ్యః సంఘ మొప్పునే సఖా!
చిరంబు శూద్రజాతి భక్తిః గల్గియున్నవారలే ॥

సుధ—రాజా!

ఉ॥ ధర్మము దప్పకెల్ల వసుః ధామరవర్గము సంచరించెడున్
ధర్మము బట్టి భూవరులుః దారులు కప్పము గట్టుచుండిరా
నిర్మలబుద్ధియుక్తులునుః నీతివిశారదులౌర వైశ్యులున్
మర్మములేక శూద్రులునుః మానసభక్తిని గొల్తు రార్యులన్ ॥

దేవ! తమరు రాజ్యభారంబు వహించినంతకాల మేలోపమైనఁ గలుగునా? మీయాజ్ఞకు మీఱువారుగలరా?

దు— నీవంటి యమాత్యోత్తముఁడు నాకు గలుగ లోపంబులుండునా?

సుధ—రాజు మంచివాఁడైన రాష్ట్రజనులు మంచివారుకాకుందురా

దుష్య—సుధర్మా! నీపేరునకు నీధర్మబుద్ధికి సరిపోయినది.

సుధ—అంతయు భవదాశీర్వాద ప్రభావమే.

దుష్య—సచివవర! వేఁటకేగవలయునని నామదికిచ్ఛ జనించె. సారథిని

రథం బాయత్తపరపుమనియు భటాళిని దగుపరికరములఁగొని వెడలుఁడనియు సాటఁబనుపుము,

సుధ—అలాగే సకలపరివారమును సంసిద్ధముగావించెద.

దుష్య—త్వరగారమ్ము. (ఇరువురు నిష్క్రమింతురు.)

2 వ రంగము.

అడవి.

(దుష్యంతుఁడు, సుధర్ముఁడు. సేవకుఁడు, ప్రవేశింతురు.)

దుష్య—సుధర్మ! జాగిలంబుల విడపించుకొని యందఱన్ని దిక్కులకు జనుఁడు నేనిచ్చట ఘోరమృగములు గలవో యచ్చటికి వెళ్ళెదను.

సుధ—అందరన్నిదిక్కులకు వెళ్ళినారు మనమీ ప్రాంతమందున్న మృగంబులఁ బరిమార్తమురమ్ము.

దుష్య—మంత్రివర!

గీ॥ శరభశార్దూల మత్తేభ♦హరిణకోటి
శిరములను భూమిపైఁబడ♦నటికినైచి
వచ్చెదందాక మీరల♦వార్వరిగాఁగఁ
బట్టుఁడీకొన్నిమృగముల♦భయముచీడి ॥

నేనీమార్గమున వెడలి కొన్నిమృగములఁ జెండాడెద.

సుధ— గీ॥ ఘనయశోధన! యీమార్గ♦మునను నేను
బోయి క్రూరమృగాళిని♦భువినిగూల్చి
భక్షణకు దగుమాంసంబు♦బట్టితెత్తు
చిన్నపనులకు దావేగఁ♦జెల్లునయ్య! ॥

దుష్య—మంచిదాలాగే తెమ్ము.

(ఇరువురు నిష్క్రమించి మరల బ్రవేశింతురు.)

దుష్య—సుధర్మ! నాకేమో యాయాసముగానున్నది.

సుధ—దేవ! ఇచ్చట తమకేమాయాసము.

దుష్య—మృగములఁ బట్టికొట్టి యాయాసముఁజెందితిని.

సుమ—ఏమిమృగములఁ గొట్టితిరి.

దుష్య—

ఉ॥ కొట్టితిఁగొన్ని కోతులను గూల్చితి సామజకోటినొక్కెడన్
బట్టితి ఘోరసింహములఁ బక్కలు వ్రక్కలుజేసి; బోనులన్
బెట్టితి సైరిభావళులఁ బింఛనుడంచితి భల్లుకంబులన్
దిట్టయటంచు నెల్లరు బరంబదిసన్నుతిఁ జేయమిత్రమా? ॥

సుమ—ఆహా! నాకుఁబరమ సంతోషము నీధైర్యమున కేమనవచ్చును

దుష్య—అమాత్య! నీవేమైన వేఁటాడి యున్నాడవా.

సుమ— గీ॥ కనినభయమొదవించెడు గరులఁబదియు
కాంచుత్రికాండకును కోతుల్పులి గములనూరు
భీకరంబగు నెలుఁగుల మూఁడుకోటి
మత్కరశరాసనంబున మడిసె భూప! ॥

దుష్య—సేవక! నీవేమైఁ గొట్టియున్నావా?

సేవ—(రోజుచు) అబ్బా! తాళండి సెప్పలేను సాలా పెద్దదాన్ని కొట్టేను. (11 అనుబంధము.)

సుమ—సింగమునేమైనకొట్టినావా

సేవ—యింకా పెద్దదండి

సుమ—శరభము నేమైనఁగొట్టితివా

సేవ—ఇంకా పెద్దదండి

సుమ—ఏమిటి చెప్పుము.

సేవ—ఆ॥ వె॥ చెప్ప రాదుదాని జెవులతో వినరాదు
నరులఁగన్న తోడ నాశమందు

సుమ—మృత్యువునేమైనఁ బట్టియున్నాఁడవా

సేవ— అంతకన్నఁబెద్ద వింత గానుండును
దానిబట్టికొట్టె నాను సామి ॥

సుమ—దానిపేరు జెప్పవేమి

సేవ—తొండపిల్ల దేవర!

సుధ—ఒరీ మూఢుఁడా! చాలునిఁకపద
దుష్య—సచివర! పట్టినమృగంబుల భద్రపరపుము.
సుధ—అలాగే భద్రముగానున్నవి
దుష్య—నాకు మిక్కిలి దాహమగుచున్నది
సుధ—తమకేగాదు సైన్యమంతయు క్షుత్పిపాసాయత్తమైయున్నది
దుష్య—ఎచ్చటనైన సరోవరంబుగలదేని చూడుము.
సుధ—ముఖపై మెల్లగా చల్లనిగాలివీచెను అది సరోవరంబులపైనుం
డి వచ్చుచున్నట్లు దోచుచున్నది.
దుష్య—ఈవాయువునకెదురుగా వెడలిన సరోవరమెుందుగనుపించు
చు పోదము రమ్ము. (అందరు నిష్క్రమింతురు)

3 వ రంగము.

(అరణ్యము దుష్యంతుఁడు, సుధర్ముఁడు ప్రవేశింతురు.)
దుష్య—సుధర్మా! ఈవనరామణీయక మెంతనివర్ణింతము
సుధ—ఆహా! ఇట్టివనం బెచ్చటనుజూడలేదు
దుష్య—ఈవనంబెవ్వనిదో ఋషివర్యునిగాఁ గానుపించెడు
సుధ—మునివరునిదగనుకనే విచిత్రములుగ గనుపట్టుచున్నవి.
దుష్య—మంత్రివర! మందారమకరంద బిందుసందోహంబులఁ బా
సముజేసి పాంథబృందంబుల డెందంబులు డిందువార గానంబు
జేయు మత్తాళి జాలంబులతోడను వారాఁగనా కదంబుముల కుచ
ములహసించు పుష్పగుచ్ఛంబులును, మాధవుండు వనలక్ష్మిని
బరిణయంబాడవచ్చుచుండెనని వివాహమునకు కీరదంపతులలం
కరించుచున్నవోయనఁగతి విలసిల్లుపూపొదరిండ్లను, పొదరిండ్లపై
నల్లిబిల్లిగానల్లిన మల్లెమొల్లలును, చిగురుటాకులమెక్కి పొగరె
క్కి సురసాలశాఖల నెక్కిసిక్కి పంచమశృతిని కోకోనినాద మె
దురంబగు గానకౌశలంబుజూపు కోయిలలును, పన్నీటికాలువలకు
దీటగుచు తేటనీటితోఁబారు సెలయేటికాలువలును, ౹౹చనుదెం

"చినవారిని" తరంగహస్తములఁ జేరబిలుచుచు భృంగారావంబున కుశలమడుగుచు, మలయానిలంబున శ్రమనపనయించుచు, తమ పానీయంబుల నాప్యాయనంబొనర్చుచు, నతిథిసత్కారమొనరించు గృహస్థునింబోలె నొప్పారుకాసారంబులును గలిగి మనోహరమైన యీ యేమున్యాశ్రమంబో దెలియదయ్యెను.

సుధ—దేవ! ఏమి మృగములు జాతివైరములులేక నొక్కతల్లిపిల్లలంబోలె మెలఁగుచున్నవి.

దుష్య—నిక్కమా నిక్కము.

చ॥ ఎలుకలు బిల్లులొక్కయెడనే చరియించెడు; లేగదూడ క్రొ
వ్వులను గూడి మేయు వృకముల్ దమబిళ్ళను బోవువేళ మే
కలఁబిలచున్; శుకంబులు బికంబులు సర్పఫణంబుఛాయలన్
పలుమరు నిద్రఁజెందెడు దృఢమ్ముగ మౌనిప్రభావమేయగున్॥

సచివరా! ఇట్టిప్రభావంబుల నిక్కపట్టగు నియ్యది తపోనిష్ఠాగరిష్ఠుఁడగు తాపసశ్రేష్ఠునిదనుటకు సందియంబులేదు. గాని యిందెందు వారియాశ్రమమున్నదో పరికించి కనుఁగొనుము.

సుధ—(దిక్కులు గలయఁజూచి) రాజ! అల్లదే యనతిదూరమునఁ గనుపించుకుటీరమే ఋషియాశ్రమమో పోదము రండు.

దుష్య—(నడచుచు) కానిమ్ము నేనటకేగిన రాజ్యంబేలుచు భక్తిహీనులగు రాజులిందు రాకూడదని యడ్డుపెట్టిన నేనేమిజేయఁజాలుదు.

సుధ—భూవర! మీవంటి పావనుల వారావిధి నడ్డుపెట్టఁజాలరు.

దుష్య-తోటకవృత్తము అటులయినను బోయిరయంబుననే
నటనమ్మునొందియు నామునిచే
బటుదీవెనఁబొందియు బాగుగపో
యిటువచ్చెదనుండుము యింపెసఁగన్॥

సుధ—దేవ! నేనీ రసాలతరువుకడ యుండెద త్వరలోఁజనుదెంచుడు

(ఇరువురు నిష్క్రమింతురు.) ఇది తృతీయాంకము.



శ్రీరస్తు.

# చిత్ర శాకుంతల నాటకము.

## చతుర్థాంకము.

### 1 వ రంగము.

(కణ్వాశ్రమప్రాంతము.)

దుష్య—(ప్రవేశించి) అదే ఆశ్రమసమీపభూమి. (చూచి) ఆహా! ఆకనుపట్టుబాలిక యౌవనికమూర్తి గాదా? ఏమీ యాసౌందర్యము

సీ॥ వంలోనిజకర్ణ♦పులుగులగతిఁగను
పట్టుముండెను కుచ♦పాళిదాని
చిలుకలువ్రాలని♦దిబ్బదొండపండన
రమణీయబింబాధ♦రంబుదాని
కందుబాసినశర♦దిందుసుందరముఖ
హసియించునెమ్మొగ♦ములరుదాని
కండచక్కెరపాన♦కంబనఁదగు పలు
మాటలచే కను♦గీటుదాని

గీ॥ గాంచుమాత్రాన నెమ్మనః♦ చెంచలించె
దానికడఁజేరుటెట్టులో♦నూవశమని
బారిదోలఁగుటయెట్టులో♦దారినేల
వచ్చినాఁడను వెఱ్ఱినై ♦ముచ్చటపడి॥

ఔర! సానఁబెట్టిన మరునిసాయకంబందువమా మానోయోగం బుండునే? మయబ్రహ్మనిర్మితంబగు స్వర్ణపాంచాలికయన దానికి బ్రాణంబులేదే? యని మిషకాంతయన దానికిభువిపై నిలచుటయు రెప్పలార్పుటయులేదె వనలక్ష్మియనినచో నీయాశ్రమం

బుసందేలయుండును. మునిపుత్రికయనిన దపంబాచరించుచు కందమూలఫలంబుల కాలంబుబుచ్చువారికింతమాత్రము సుకుమారిబోడమఁగలదె. కాదు కాదు నిజముగా నాపాలి భాగ్యదేవతం బోలియున్నది.

కం॥ చెండ్లా చన్గవ; మారుని
విండ్లాకనొ్బమలు; కురులు భృంగమ్ములు లే
తూండ్లా బాహులద్వయమె
పెండ్లాడఁ వలదెయిట్టి పేర్మియవెలదిన్ ॥

ఔరా నేనెంత వెఱ్ఱిని తపోనిష్ఠాగరిష్ఠుఁడైన తాపసశ్రేష్ఠుని పుత్రిమీఁద రాజాధిరాజనగు నేనేఁడ నాకామాని పుత్రిక నొసంగనిచ్చగించునా? నీకిడఁ గూడదనుకమానునా? (తలయూచి) కానిమ్ము నాకన్న నీమునికొక మంచిసంబంధము గుదురునా? సాధ్యమైనంతవరకు జెప్పెద. కాదేని రాజ్యమొసంగెద నంతియేకాని దీనిని పరిణయంబాడకమాన మానిని మనఁజాల, నికతడయు నేల, శరంధుసముపాలయగు నాబాలక సకేగి యియ్యదియే మునాష్య శ్రమంబో తానెవరో తెలుసుకొనెద. (అటునిటునడచుచు శకుంతలనారసి) ఔరౌరా!

గీ॥ కలికివసతిరుగేరును కలభములను
బాలముంగురులాబంభ రాఁబోలు
పానకంబిను బావియాపడతిమోవి
చేడనేకీతిసృష్టించి నాఁడుబ్రహ్మ ॥

నన్నుఁజూచి కుటీరములో డాగినది. నేనునుకొంచెమీ పొదరింట్లోనుండెద. (అనితొలఁగును)

శకుం—ఔరౌర! అటచక్కని పురుషాకారంబు గనుపించుచుండె. నాతఁడెవఁడై యుండనోపును.

ఉ॥ ఎవ్వఁడొ యీకళావిభవుఁ డివ్వనమందు చరింపనేలనో

పువ్విలుకానిసోయగముం బోలునె యీనవయవ్వనాంగుతో
దవ్వులనేగువాఁడిటకు తద్దయురాఁగతమేమొ తోడులే
డెవ్వరు నామమెయ్యదియొ యేపురమోఁగమనింపనెట్లగుర్ ॥

ఈసుందరుని యందంబుగనిన డెందంబుజెదరి చీకాకయ్యె. చెఱకువిలుకాఁడు చేఁజిక్కించుకొని పంచబాణంబులచేఁ బొందివేయసాగె; సుమబాణవేధనకు భరింపఁజాలనిట్టి సుందరుం డెవ్వఁడెదురై నాతో మాటలాడి మరుకేళిఁ దేల్పఁగలఁడు. కాసిమ్మ కొంచమాగిన నతఁడిటకేవచ్చును. (అనితొలఁగును.)

దుష్య—(మఱల వెలికివచ్చి) కొంచము లన(కేఁగంటిప)నారము నా పైఁబ్రసరింపఁజేసి శర్మశాలలోనికేగినది. ఆహా!

గీ॥ ఆదసికాంతసృష్టించు నపుడు బ్రహ్మ
పలుకువెలఁదని తనచెంత నిలిపి తద్వ
ధానఁజేయంగఁబోలు కాదేనిగలదె
ధరణిలో పలనిట్టి సౌందర్యయువతి ॥

ఈమనోహారిణి నెమనివర్ణింతును.

చ॥ సరసిజనేత్రి పాదముల సామ్యమునందగలేక పద్మముల్
సరగున పంకజంబులన నాగుచునిట వసించె; మోముచేఁ
బరిభవమందిచందురుఁడు నభస్థలినిల్చెను వాక్యసంతతుల్
వెఱపొదవింపఁజిల్క పృథివీజములన్ విడనాడకుండెనుర్ ॥

పోసిమ్మ ‘‘కాంత! నిన్నుఁగోరి వచ్చినవాఁడ ఇఁకవిడనాఁడ. నీకుదాసుఁడ నీకునైసెగమెలఁగువాఁడ’’ నని పలుతెరగుల బ్రతిమలాడినఁ గనికరించదా? కానిమ్మాతీరున బేలనై యందరాని మానిపండ్లకాశవహించుగతి తలంచిన నేమికారణము. ఇఁదువఁబోవుచు రుచులడుగనేల చల్లకువచ్చి ముంతదాచనేల. ఇదే సమీపించెద. (అనిసమీపమునకుఁబోవుచు)

సీ॥ ఈకాంత పలింపులు సోకిన శైతేశు
నర్చించు సత్ఫల మందరాదే?
ఈవానయెమ్మోము గనుఁజూచినఁ బున్నమ
నుపవసించిన ఫలంబొందరాదె
ఈకలికి కౌఁగిట నెనఁబాయకుండిన
భూప్రదక్షిణయుక్తిఁ బొందరాదె
ఈరామ యధర సుధారసం బానిన
పరుఁడమృతంబును మఱవరాదె
గీ॥ ఇన్ని మహిమంబులీసతి యందు గలుగఁ
గోరుదురె యన్యభోగ మెవ్వారలైన
కరిగమనకే మహత్త్వముఁ బరుఁగుగాఁగ
నుండెనో వాని తపమింక బండకున్న ॥

ఈకాంత కొక్కాభరణమేని మేనిలేదు బుషితనూజవలెనున్నది.

సీ॥ రత్ననిర్మితమైన రమణీయ హారముల్
లేశములైనను లేవు సతికి
కనకమయంబైన కాంచీ కలాపంబు
కనఁగశూన్యంబయ్యె కరిగమనకు
ఘల్లు ఘల్లని మ్రోయు కాళ్ళగజ్జియల భా
వంబుగానుండదీ యంబుగళకు
ధగధగమని వెల్గు తాటంకయుగ్మంబు
శ్రవణద్వయినిసున్న జలజముఖికి
గీ॥ హారమెవ్వవి లేకున్న భారుణి వి
హారమొనరించు లచ్చి విగేరుచుండె
సకలభూషణ యుతయామ సౌధముల వ
సించు వేళను దీని వర్ణించఁదరమె? ।

ఆహా! ఎంతటి చిత్రము.

శా॥ ఔరా రాజకులంబునం బొడమి విద్యాబుద్ధులన్ మేటివై
ధీరుల్ సత్కులసంభవుండనుచు నెంతే స్తోత్రముల్ జేయనీ
శూరాగ్రేసర నెమ్మనంబునకు బల్ చోద్యంబు బుట్టించునో
నారీసుందర దేహవల్లిక! మహానందానుసంధాయికా! ॥

ఇది నిక్కముగా మునికన్యయైన నాకేల మోహంబు బుట్టును. కులంబెద్దియో తెలియదు, రాచకుమారియే గావచ్చును, దీనివృత్తాంతము దెలియగోరుట కిందెవరి నడుగువాఁడ. కానిమ్మిటు లువ్విళ్లూరుచున్న నేమి వ్యర్థకము? ఈబాలికనే యడిగెద. (సమీపించి)

ఉ॥ ఇవ్వనసీమనొంటిఁ జరియించెద వెవ్వరిదాన వీవు ని
కెవ్వఁడు భర్త; తండ్రియెవఁ డెందరు సోదరు లెందునుండిరో
జవ్వని! నీదు నామమును జయ్యన నా కెఱుఁగంగఁ జెప్పుమా
యువ్విళులూరువాఁడ వినయోక్తి మొగిన్ సరసీరుహేక్షణా ॥

నీముఖారవింద సందర్శనంబు డెందంబున కానందంబొనరించె.
నీ వెవ్వరో దెలుపుము సుందరాంగి.

శకు—(ఇంచుక సిగ్గుతో)

గీ॥ ఎన్నఁడెఱుఁగని నీవిట్లు నన్నడుగ
నేల? ప్రేమఁడి నీకులశీలములను
ముందు జెప్పుము సంతసమందిపిదప
నాదుకత నెఱిగించెద మేదినీశ ॥

రాజా! నన్నేలడిగెదవు నీకులగోత్రములఁ దెలుపుము.

దుష్య—కామినీ! ఆలింపుము.

ఉ॥ ఇంతకుబూసవచ్చి పచరింపక యుందునె? వారిజాక్షిరో!
శాంతయుతుండు నిలుఁడన క్ష్మాతలనాథుఁడు నాదుతండ్రి; దు
ష్యంతుఁడ నేను వీరుఁడగు బాలయుఁడన్ నవయౌవనాంగుఁడన్
దంతిపురంబు మాది వనితామణి! నేను ధరాధినాథుఁడన్ ॥

నా యుదంత మాద్యంతము జెప్పితి యిక నీసంగతి నెఱిఁగింపుము.

శకు—(తనలో) నేనీతనితో నాయదార్థముజెప్పక కొంతవడిదాచెద

(ప్రకాశముగా)

గీ॥ మానివరులనిశంబు సన్మానపాత్రుఁ
డనుచు గౌరవమొనరింప నలరుకణ్వ
మునికి ముద్దుకుమార్తెను జనవరేణ్య!
పేర్మిశాకుంతలయటంచు బిలతురయ్య ।

దుష్య—ఆహా! ఎంతటిమహాశ్చర్యము కణ్వపుత్రికవైన నిన్నెట్లు నమ్ముదును. నీపై నాకుమిక్కిలి మోహంబుగలిగియున్నది. నిక్కమైన మునికన్నవైన పౌరవుఁడనగు నామనంబేల చలించెను.

(12 అనుబంధము.)

శకు—అహంకారమున కెవ్వరైననేమి,

దుష్య—మాది చంద్రవంశము మమ్ముమీరి యహంకారము పైకి రాఁజాలదు.

శకు—రానివ్వకున్న నిటకేలవచ్చితివి.

దుష్య—రాకుమారితెవుగాన వచ్చితి,

శకు—రాకుమారికనని నీకెట్లుతెలియును, (13 అనుబంధము.)

దుష్య—నీపైనాకుగల మోహమే జెప్పుచున్నది.

శకు—ఇట్టిమోహములు రాచకూఁతులయందేమి యితరులయందుండఁగూడదా?

దుష్య—అటులనకుము ధర్మయుతులగు రాజులకు బ్రాహ్మణకన్యలు బూజనీయులేకాని భోగయోగ్యులుకారు. దానిచే తప్పక నీవు రాజకన్నవు.

శాకుం—(తనలో) మున్నునేను తండ్రికడవినినమాటలు జెప్పక మరికొంతకాలమాపెద. (ప్రకాశముగా) అయ్యా! నాజనకుండు నిక్కముగాఁ గణ్వమునియే.

దుష్య— గీ॥ నాతిరో! నీదుపలుకులు నమ్మఁజాల

నాలసించిన మరుబాకితాళఁజాల
నిక్కముదలంచుమా కరుణించిశనుము
బొంకులాడుట నీబోటిబోటికగునె? ।

శాకుం—నిజముగాఁక యిందబద్ధమేమున్నది.

దుష్య—అంతమాత్రమున నీమాటలు విశ్వసించుటకు వీలులేదు.

శాకుం—ఇంకసందేహమేమున్నది.

దుష్య—సందియుంబుగాదా? నీవన్నమాటలకు

శాకుం—అదేమి?

దుష్య—నీవన్నతపమాటయే సంశయము.

శాకుం—నామాటలన్నతములనిదోచెనా?

దుష్య—స్త్రీలకసత్యంబులాడుట సహజంబుగదా?

శాకుం—మీరాచకన్నెలంబోలె మునికన్యలు గల్లలకుబుట్టినిండ్లగారు

దుష్య—కాంతా! ఈవృథాకాలక్షేపణముతో సార్థకంబేమి?

(14 అనుబంధము)

శాకుం—(తనలో) ఇఁకనిజముజెప్పెద నాలసింపఁ గోపంబువచ్చెను (ప్రకాశముగా)

గీ॥ మాలినీతీరంబునకువచ్చు మౌనులెల్ల
కీకుమారికె యెవగనిఁబృచ్ఛసేయ
మేనకా కౌశికులపుత్రిమానటంచు
బలుకవినుచుంటి కణ్వునిపలుకులనఘ! ।.

దుష్య—ఆహా! ఏమీచోద్యము.

ఉ॥ ఎంతటిచోద్యమయ్యె నలినేక్షణ యూహమ పన్నగంబుపై
సంతత మబ్జనాభుపద సారసముల్ తలపోసిపోసి ని
శ్చింతదపంబుసేయు మునిశేఖరుఁడౌ కుశికాత్మజుండు తా
కాంతను నిచ్చగించునె? సుఖంబులఁదేలునె? కన్నెఁగాంచునే
సురపురనివాసినియగు మేనకయేడ? గాధిసుతుండేడ? నక్కకు

దేవలోకమున కెక్కడికెక్కడ. ఆకాంత యిటురాఁగతంబేమి, విశ్వామిత్రుఁడు బొందనేల? నిన్నుఁగాంచనేల?

శాకుం—నిక్కముగా నీవనినట్లు విశ్వామిత్రుండు ఘోరతపంబు సేయుచుండ నను దేవేంద్రుఁడా తపంబునకు వెఱచి తపోభంగము నర్ప మేనకనంప నాకాంత మునివరు లోబరచుకొనియె.

దుష్య—అట్టిమహానుభావుం డెట్లులోనయ్యెను.

శాకుం— గీ॥ గానకౌశలమొక్కింత గానఁజేయఁ
దత్తరంబునఁ దనకుదా మెత్తఁబడుచు
కులుకుగుబ్బలనంటి పూవిలుతు కేళి
నోలలాడుచు కనియెను బాలనపుడె ॥

అటులిరువురుగలసిన తొమ్మిదిగడియలకేను వారికిజన్మించితి.

దుష్య—పిమ్మట నీవెట్లువృద్ధినందితివి

శాకుం—అయ్య! మేనకావిశ్వామిత్రులు నన్ను వీడివెళ్లిరి. అంతకణ్వ మహాముని యునకే కాంతేవాసులఁ గూడుకొని మాలినీనదీస్నానమునకురాగ నచ్చట శకుంతదంపతులచేఁ గాపాడఁబడుచుండు నన్నుఁగొని తెచ్చెను.

దుష్య—శకుంతదంపతులు నిన్నెట్లుకాపాడె.

శాకుం—విశ్వామిత్రుని తపోమహిమచే

దుష్య—కడుపరేమయ్యె

శాకుం— గీ॥ మునికుమారులు గుమిగూడి ముదముతోడ
గణ్వముని వెంటరాగ నాఘనుఁడునన్ను
దెచ్చి తనకన్నముద్దుపుత్రిక విధానఁ
బెంచుచుండెను మిక్కిలి ప్రేమతోడ ।

ఆశకుంత దంపతులచే రక్షితనగు కతన శాకుంతలయని నామంబిడిరి.

దుష్య—చెలి! నిక్కమువచించితివి విశ్వామిత్రుఁడు క్షత్రియకుల

సంభవుఁడు. నీవాతఁడిచ్చియు కుమారితెవ్వగనుకనే నాకాలాటిమో
హంబుగలిగె నిశ్చయముగా నన్నునీవరునిగా వరింపుము.

(15 అనుబంధము.)

శకు—సీ॥ సత్తపోధనుల యాశ్రమములు కామవికారంబు
జూపుట ఘనమటయ్యా!
జనకుంమునబ్రిజ్ఞాన వనదికణ్వమునీంద్రుఁ
డింటిలో లేడని యెరుగుమయ్యా!
నిను మెచ్చివారొ సంగినవివాహంబాడ
స్వాతంబునందు దలంతునయ్యా!
పరకాంతనీరీతి బలిమిమైబట్టిన
హారలకపకీర్తి వచ్చునయ్యా!
గీ॥ పుడమిఱేఁడులకింత తుందుడుకటయ్యా!
యించుకనిదానముఁగను యోచించుమయ్యా!
నీకుధర్మంబుజెప్పఁగా నేర్తునయ్యా!
కరుణగనుమయ్యా! యిదెనమస్కారమయ్యా! ॥

మాజనకుండు లేనికాలమున నిట్టిమాటలాడ న్యాయంబుగా
దు మాజనకుండు వచ్చువరకునిలచిన యర్ఘ్యపాద్యాదులొసంగి
యాదరించును.

దుష్య— గీ॥ అర్ఘ్యపాద్యాదులేటికో యతివనాకు
నధరపానంబొసంగినఁనంతెచాలు
మరుఁడుకరుణింపకిటు పంచశరములకట
డెందమునవైచి తాపంబునందఁజేసె ॥

(16 అనుబంధము.)

శాకుం—సకలధర్మవేదులగు తామేయిట్లు పరకాంతలఁగోరిన తామే
లురాజ్యమందు జనులెంత జారులై యుందురోగదా.

దుష్య—కాంత! వివాహితయగుకాంత పరకాంత దానిబట్టుట రా

జాలకుఁదగదుగాని కన్యనైననిన్నుఁ గైకొనుట సకలజనసమ్మతము
నీవు బాలికవు తెలియఁజాలవు.

శకుం—ఆ॥ వె॥ తండ్రియింటలేని ♦ తఱివచ్చి బాలిక
నైననన్నుఁ గలయుమనుట తగునె?
సాధువులవసించు సతులఁ ♦ గోరెదు మీకు
నాకుఁ బొందుతగవు ♦ గాదు పొమ్ము ॥

దుష్య—కాంత! యింతప్రసంగమేల.

తే॥ గీ॥ ఉవిద! చలమేల మరుబాళిఁ ♦ గోర్వఁజాల
కున్నవాఁడను నాయెడ ♦ నున్నకూర్మి
మన్ననననోనర్పెదో లేక ♦ యూఁదుబారి
కప్పఁజెప్పెదో నిక్కంబుఁ ♦ జెప్పుమిపుడె ॥

కాంత! నీవాఁడనుగానా? నామీఁదదయలేదా?

శాకుం— క॥ నీతిమార్గంబునే గను ♦ నింపుమయ్య!
పరసతులఁ గోడఁ గ్రీడింప ♦ పాపమయ్య!
కన్యకాగౌరవము జెడ ♦ గలుగునయ్య!
తండ్రియిది విన్న తప్పఁగాఁ ♦ దలఁచునయ్య! ॥

నీవంటి నీతివేత్తలగు రాజులు పరస్త్రీలఁ గోరుట న్యాయమా?
దాసులమన భావ్యమా?

దుష్య—కాంత! నిశ్చయముగా నీదాసుఁడనే యాకందమూలాదులఁ
దిని యిటనుండనేల నాదండఁజేరుము షడ్రసోపేత భోజనమొన
ర్చి విశేషవైభవముల నుండుదువు.

శాకుం—ఇట్టితపోభాగ్యమునకంటె విశేషమేమున్నది.

దుష్య—సీ॥ వారిజంబులవసఁ ♦ గేరుపాదంబుల
నడవులనేరీతి ♦ నడవఁగలవు
పట్టుపుట్టంబులఁ ♦ గట్టఁగాఁదగుమేన
నీనారచీరల ♦ నూనఁగలవు

కమ్మనిదధ్యోదనమ్ము నిందునోటఁ
గాయకూరలను భోంచేయఁగలవు
సౌధంబులవసింపఁ జాలినదానవీ
యాకుటిండ్లను జేరఁ గాడఁగలవు
గీ॥ చాననా వెంటరమ్మి నా మానసమ్ము
నీకు స్వాధీనమై మరి నాకపోయె
బాల! నీమోవి తేనియఁ గ్రోలనిమ్ము
కౌఁగిలిమ్ము సుఖంబుగాఁ గలయనిమ్ము ॥

ప్రియసీ! ఈకాననవాసమేల సుఖభోగంబుల గుర్తైయుఁగ కుంటివిగదా?

శకుం—భూపాల! నీభాగ్యభోగ్యంబులు నాకేల?

దుష్య—ఎన్నిజెప్పినను నీవెఱ్ఱిదానవై తివిగదా?

తే॥ గీ॥ చంద్రకాంత శిలామయ సరసవేది
కాతలంబున మెలఁగుచు ప్రీతితోడ
జెలియలూడిగ మొనరింప మెలఁగుచుందు
వలెవ! నా వెంటసత్వర మరుగుదెమ్మ ॥

చంద్రకాంత శిలామయంబైన వేదికలయందు దాసదాసీజనంబు లూడిగంబొనరింప మిక్కిలిభోగంబులచే నుండగలవురమ్ము

శకుం—ఈమహాభోగంబులకునై జనకునానతి మీరుదునా?

దుష్య—గీ॥ నీదుజనకుండు "దుష్యంతమేదినీశుఁ"
డనిన మాత్రానమ్మదమంది నినువొసంగి
పెండ్లిఁజేయును నాకు భీతివదలి
చేరఁగారమ్మ కౌఁగిటఁ జేర్చుకొమ్ము ॥

నీకుభయమేమి నను జూచినతోడనే నీజనకుండు నిన్నునాకిచ్చి పెండ్లిఁజేయఁగలవాఁడు.

శకుం—అటులైన నీకింతలో నింతతొందరేల? జనకుండరుదెంచి నీ

చ్చునో యివ్వఁడో నేనెరుఁగనుగదా?

దుష్య—నారీమణి సందియంబందక నావలుకాలింపుము.

ఉ॥ ఎంతటిదాననే సరసిజేక్షణ! మారశిలీముఖాగ్నిచే
నెంతయుడస్సియున్న ధరణీశ్వరు నన్నుదయార్ద్రదృష్టి నో
రింతగనుంగొనంగ గమకింపవు; నిక్కము పూరుషుండు దా
కాంతను మందుకోరఁ గొఱగాఁడుసుమీ! యొకకుంటిగవ్వకున్ ॥

శకుం—భూవర!

ఉ॥ మోదముతోడ కందఫలములఁ గొని మాజనకుండువచ్చి మ
ర్యాదగనిన్నుఁగాంచి కుశలాదులఁ బ్రశ్నలొనర్చి నన్ను నా
హ్లాదముగా నొసంగి శిభనాతిశయంబునఁ బెండ్లిఁ జేయునో
మేదినినాథ! పొందెదవ మేయసుఖంబుల శాంతిసందుమా॥

దుష్య—చెలి! ఇన్నిమాటలేటికి నీజనకుండేమిచేయఁగలఁడు? మనము
రువురము గాంధర్వవివాహమై సుఖింతము.

శకుం—మాజనకుండు లేనియెడల గాంధర్వవివాహమైనఁ గానేరదు.

దుష్య—తరుణి! గాంధర్వపరిణయం బెవ్వనితోడఁ బనిలేకయే గా
వచ్చు నాలింపుము.

సీ॥ కోకోయనుచుగూయు కోయిలారావంబె
ఘనమైనమంగళధ్వనులుగాఁగ
వల్లిబిల్లిగ తీవెలల్లిన పూఁబొద
రిండ్లెల్లఁ గ్రొత్తపెండ్లిండ్లుగాగ
వృంత వినిర్గతవివిధ పుష్పావళుల్
రమణీయమగు తలంబ్రాలుగాఁగ
అందందువిహరించు నావనదేవతా
పాళియే విప్రదంపతులుగాఁగ

గీ॥ మారుఁడే యాజ్ఞికుఁడుగాఁగ మానసమున
నలరు ననురాగవహ్ని సాక్ష్యంబుగాఁగ

వనకుఁదాఁ జుట్టమగుచు గాంధర్వవిధిని
యంబుగావలె కన్నియ నవనివిభుఁడు ॥

శకుం — మనసు సహింపకున్నది.

దుష్య — రాజ్యంబేలు రాజువచ్చి నిన్నుఁగోరఁగ మనసు నప్పదని చెప్పుచున్నదానవే ఎంతటి వెఱ్ఱివి.

శకుం — వెఱ్ఱితనంబేమియు లేదుగాని

చ॥ పరమొకటియ్యఁగావలె ధ్రువమ్ముగ నాకును నీకుఁ బుట్టు సుం
దరునకు ముద్దుపట్టనికిఁ దప్పక రాజ్యరమామతల్లి కా
కర సరసీరుహాగ్రహణ కాంక్ష నొసర్పుము లేకయున్న నీ
పరిణయ యత్నమే విడువ బాగగు భూపకులాగ్రరత్నమా ॥

నాకు బుత్రుం డుబుట్టిన నీరాజ్యంబంతయు వానికొసంగెదనని యొప్పుకొనుము.

దుష్య — గీ॥ అట్టిభాగ్యంబు మనకబ్బెనేని
నీవు కోరిన రాజ్యంబు నిచ్చి మెచ్చి
నేను పట్టాభిషేకంబు సేర్పఁజెలఁగ
జేతుఁజెప్పెదఁ జేయిలోఁ జేయివైచి ॥

ఇందువదన! నీవు నాకు భార్యవుగావడమే సకలభాగ్యంబులు నాకబ్బినట్లు. మనకు కుమారుండు బుట్టెనేని నీయిష్టానుసారంబుగా వానికి సర్వరాజ్యంబిచ్చి మనము సుఖంబుగాఁ గాలము బుచ్చెదము.

శకుం — సుందరాంగ! నినుజూచినతోడనే నా డెందంబు సంతోషంబునందె. తండ్రియాటంకమునకంటె మిగులసంశయంబుగలిగె. నట్టిసంశయంబు దీర్చితివి. నీవు నాహస్తంబున హస్తంబుంచి రాజ్యంబు సుతునకిచ్చెదనని మఱల గట్టిపఱిచినఁ గావింపుము.

దుష్య — గీ॥ బ్రహ్మ విష్ణు మహేశ్వర భాస్కరాబ్జ
దిక్పతుల పాదమాన పృథ్వీధరంబు

నాకు నీకు జనించెను నందనునకు
ధారపోసెద నీమాటఁ దప్పనింక ॥

అంగనా! ముందుగా నాముద్దుటుంగరం బొసంగెదఁ గైకొనుము.

(అని యుంగరమిచ్చును.)

శకుం—రాజేంద్ర! కృతార్థురాలనైతిని సంతోషమయ్యె.

దుష్య—కాంత! గాంధర్వవైవాహికమయ్యె. సత్వరమరుదెంచుము. అదే యుల్లిబిల్లిగా నల్లిన పూపొదరిల్లుజేరి మరుకేళిఁ దేలుము.

శకుం—(సిగ్గుతో) చిత్తము. (ఇరువురు నిష్క్రమింతురు.)

2 వ రంగము.

కణ్వాశ్రమము.

(19 అనుబంధము.)

శకుం—(ప్రవేశించి) అయ్యారే! దుష్యంతభూకాంతుం డెంతలో నన్నెడబాసె. పుట్టిననాటఁగోలె నెన్నఁడు రాజపురుషుల నెఱుఁగని నేనాతని జూడనేల? చూచితిబో మాటాడనేల? మాటాడిన నాతఁడు మారవికారుఁడై నన్నలయ బ్రతిమాడనేల? బ్రతిమాలిన నే నంగీకరింపనేల? గాంధర్వపై వాహికంబుగా నేల, ఐన వెనువెంట ననుఁగొనిపోవక సంభోగానంతరము ననుగాంచి "కాంత! నీవిందే యుండుము సపరివారుండనై సత్వరమేగుదెంచి నినుఁగొనిపోయెద" నని జెప్పిపోయె నీమాటలు నమ్మదగునా? తగవా? యని సందియంబు బొడమెడు (చూచి) అదె తండ్రిగారు వచ్చుచున్నారు నే నేమని ప్రత్యుత్తరమొసంగుదాన దైవమే గలఁడు. యిపుడు చింతించిన నేమి సార్థకము?

కణ్వ—(ప్రవేశించి తనలో) ఆహా! కుమారికశకుంతల మొగము చిన్నబుచ్చుకొనియున్నది. కారణమేమి చెపుమా! తన్నెడబాసి నేనింతకాల మాసరస్వతీతటంబునఁ దడసితిననియా? లేక ప్రతిదిన మేగుదెంచు మునివటుల కాతిథ్యమొసంగుటతో పొరబడెనా?

అయినన డిగెద (ప్రకాశముగా) అమ్మాయి! అమ్మాయి! శాకుం తల! ఏమిది పలుక చింతించుచున్నది. యోగదృష్టిఁగనుఁగొనెద. (చూచి) చేల! ఇంతమాత్రమున కింతచింతయేల నేఁజేయఁ దలఁచిన కార్యము భగవంతుఁడే నెఱవేర్చె. అమ్మా లెమ్ము.

ఉ॥ చింతిల నేలనమ్మ! నినుఁ జేకొనినట్టి ధరాధిపుండు దు
ష్యంతుఁడు; నీకు క్షేమమగు నమ్మ! జనించు నుపుత్రుఁ డొక్కఁడ
త్యంత యశోవిశారదుఁడు న్యాయపథంబున రాజ్యమేలు ధీ
మంతుఁడు గాఁగలం డధిక మాన్యచరిత్రుఁడు నీతిపాత్రుఁడై ॥

తనయ! నీవు గాంధర్వంబున వరించిన వరుండెక్కువైన బుద్ధికలిగి మిక్కిలి చక్కఁదనంబునఁ బ్రవర్తిల్లువాఁడు వానివరించుటచే నాకత్యంత సంతోషమయ్యె.

శకుం—జనకా! మీరు లేనంతఱి గాంధర్వమున నేనాతని వరించి నందులకు క్షమింపుము. భూపాలుఁ డనేకవిధంబుల నన్ను బ్రతిమాలఁగ నేనంగీకరించితిని.

కణ్వ—ఆతఁడు వరించుతఱి నేమనియె.

శకుం—తండ్రీ! ఆభూకాంతుఁ డేకాంతంబుననున్న నాకడ కేతెంచి యనేకరీతుల వాకొనియె నేనందుల కంగీకరింపక "మాజనకుండఖండ తేజోనిధి, మునికులవతంసము కణ్వమహాఋషి యాయన వచ్చి నీకిచ్చి ననుబరిణయం బొనర్చిన మెచ్చి నేవచ్చెద" నన నాతండు "తన్వీ! మీజనకుండు నేనన సంతోషితస్వాంతుఁడై నిన్నుతప్పక యొసంగెడుఁగాని నేనంతవరకీ కంతుని సుమబాణపరంపరలకు తాళఁజాల, మనఁజాల, నోర్వఁజాల, ననుఁగౌఁగిటఁజేర్చి మన్నించి కేళిఁదేలించి ముద్దొసంగుము" ని బ్రతిమాలాడెను, వేడుకొనెను, ప్రార్థించెను, నీదాసుఁడననెను, దానికే నిట్లంటి "భూవల్లభా! మనకిరువురకు బొడము కొమరుని కరిపురసామ్రాజ్య పట్టాభిషిక్తుని గావించెదనని కరంబున కరంబునిడు" మని నేఁబలుక

దానికాతండంగీకరించి సూర్యచంద్రాదుల సాక్షినిడి నాకువాగ్దానమొసంగె నేనంత దానికి సమ్మతించి కృతార్థురాలనయితి;

కణ్వ—ఔను నీగర్భంబునఁ బుత్రుండె బొడమును.

సీ॥ పతిసద్దైవంబటంచు భావముననమ్మి
యున్న నినుమెచ్చితినికోరుమువిదవరము
లెన్నియేనియు కాదనకిచ్చువాఁడ
నమ్మ! సంతోషమందఁగదమ్మ! తనయ ॥

తనయా! నీసాత్త్వికబుద్ధికి మెచ్చితిని, వరంబుగోరుమిచ్చెద.

శకుం—నాకు బుత్రుండు గలుగునని సెప్పితిరి. అట్టికుమారునివంశ మాచంద్రార్క స్థాయిగానుండి కీర్తిఁగని ధర్మాత్ముల కన్నిపట్ల గునట్లు వరంబొసంగుఁడు.

కణ్వ—సకలసామంత రాజన్య సమస్తకన్యస్త కిరీటాగ్రరత్న ప్రభాపుంజరంజిత చరణకంజ యుగళుండును, సౌభాగ్యయుతుండును, దీర్ఘాయుష్మంతుండును, శాత్రవపర్వత నిర్మూలన వజ్రాయుధుండును, ఆర్తత్రాణ పరాయణుండును, సకలవిద్యా విశారదుండును, వైభవవిజిత శచీవరుండును, రూపవిజిత కందర్పుండును, గాంభీర్యపరిహాసిత సాగరుండును, పరాక్రమజిత శ్రీరాముండును, మాతాపితృభక్తి సంభరితుండును, నగుకుమారుండు బొడమి హస్తినాపురరాజ్యలక్ష్మీ కరకముల గ్రహణోత్సుకుండై ప్రజాపాలన మొనరించుచుఁ దిరఁగాంచి సంతోషించెదవుగాక. యింతకన్న నీకింకేమికావలయు.

శకుం—అయ్యా! యింకనాకేమియును వలదు. తమబోటి మునిచంద్రులకుబుట్టిన నాకెట్టిలోపంబులుండదు నేధన్యురాలను.

ప్రవేశము—శిష్యులు.

1 శిష్యు—ఓరీ మనగురువుగారికి పూజాసమయమైనది రండు,

2 శి—(పైఁజూచి) అప్పుడే చండకిరణుండగు భానుండు మధ్యందినవర్తియయ్యె.

3 శి—ఓయి! నీవెన్ని ఫలములఁ గోసితివి.

1 శి—సహపాఠులార! అదే గురువుగారు మనరాకకై వేచియున్నారు పోవుదము రండు. (కణ్వునిసమీపించి)

అందరు—దేవ! నమస్కారము.

కణ్వ—విద్యాభివృద్ధిరస్తు.

1 శిష్యు—అయ్యా! ఇదిగో పవిత్రపుష్పఫలాదుల గైకొని వచ్చితిమి తీసికొనుఁడు.

2 శి—గురువర్య! ఈసమిత్కుశ ఫలాదులఁ గైకొనుఁడు.

3శి—ఈదర్భల నంగీకరింపుడు,

శకుం—జనకా! మాధ్యాహ్నిక కృత్యంబుల నిర్వర్తించుకాల మాసన్నమైనది.

కణ్వ—వత్సలార! మీమీసామగ్రిలఁ గైకొనిరండు పోవుదము.

అందరు—చిత్తము. (నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.





శ్రీరస్తు.

# చిత్ర శాకుంతల నాటకము.

## పంచమాంకము.

### 1వ రంగము.

(పునః ప్రవేశము శిష్యులు.)

1 శిష్య—ఒరే! అదేమోగాని శాకుంతలకు గర్భమై మూడేండ్లయి నను ప్రసవించుటయేలేదు కారణమేమో.

2 శిష్య—ఒరి నీయిల్లుమునుగ నదేమికదుపురా బల్లఁబుట్టినట్లున్నది.

3 శిష్య—గర్భమని నేనెప్పుడు నమ్మలేదు.

2 శిష్య—ఏటికీమాటలు కణ్వమహాముని భూతభవిష్యద్వర్తమాన వేత్తగనుక వారాడిన మాటదప్పదు. కాననీమెకు కొమారుండు జన్మించెదు.

1 శిష్య—గురువుగారికన్న నాగతానాగతములు నీకే బాగుగాఁ దె లిసినట్లున్నది.

2 శిష్య—నీపరిహాసపు మాటలు జాలును చదివితె నీవేచదివితివిలే జ్యోతిశ్శాస్త్రము.

3 శిష్య—ఉండుముండుము లోపలనేమో ధ్వనివినవచ్చుచున్నది.

(తెఱలో)

ఆహా! నేఁడెంతసుదినము మనశాకుంతలగర్భమునసొక్కముగ శిశువుబొడమెను. పోదమురండు.

1 శిష్య—వినుచున్నారలా! అప్పుడే శాకుంతల ప్రసవించినదట. ము నిపత్నులందరు జూడబోవుచున్నారు.

(నిష్క్రమింతురు.)

2 వ రంగము.

ప్రవేశము—కణ్వుఁడు.

అయ్యారే! మాశకుంతలకు బొడమిన చిన్నకుఱ్ఱఁడు భరతాభిధానుండై దినదినాభివృద్ధిఁ బొందుచు శుక్లపక్షశశాంకు ననుకరించుచున్నాఁడు. అప్పుడే పదిరెండవవత్సరములు సండినవి. పరాక్రమమున నదేమోగాని వానినిమించినవారలు లేరైరి. సకలజన భయంకరమగు సింహవ్యాఘ్ర మదేభ ఖడ్గమృగములఁ దురంగంబులఁబోలె వాహనంబున నుపయోగించి స్వేచ్ఛఁగాఁ జరించుచుండెను. ఆహా! ఆసౌందర్యము, ఆగాంభీర్యము, ఆసౌకుమార్యము, ఔదార్యము, ఆశౌర్యము త్రిలోకంబుల నెందేని వినికనియెఱుఁగను మాశకుంతల భాగ్యమే భాగ్యము. దుష్యంతుని యదృష్టమేమని కొనియాడుదుఁ. ఇట్టిముద్దులపట్టిని కనులారఁగనినచో నాతఁడెంతటి సంతోషవారాసి నోలలాడెనో గదా? ఔను పులికడుపునఁ జలిచీమపుట్టునా? పుట్టదు పుట్టదు. పూఁబుట్టినతోడనే పరిమళింపఁగలదనుగతి వీఁడుపుట్టినదాది యెంతెటిపరాక్రమవంతులనో గణింపఁదగియున్నాఁడు మున్నెమి నేఁడేమి యెందరురాజులులేరు, రాజకుమారులులేరు, వారందరికీ శౌర్యధైర్య గాంభీర్యములున్నవా? ఏలయుండును. వారందఱు వీనివలె జన్మించినారా? లేదు యీతనికిజూడ విశ్వామిత్రుఁడు మాతామహుఁడు. అతిడఘటనాఘటనా సమర్థుఁడుగదా? ఇఁకమాతామహియును సకలసురాసుర వర్ణనీయమై అతులితసౌందర్య విభ్రమా విఖ్యాత శరీరధారిణియైనమేనక. అదియటులుండ తండ్రిగారా? పరాక్రమవిజిత శతక్రతువు దుష్యంత భూకాంతుఁడు. పెరుగుచున్న తావా పుణ్యాశ్రమము యెట్టిదో యిఁకనీతఁడు సామాన్యుఁడెట్లగును.

(తెఱలో) ఓహో కణ్వమునిచంద్రా! రక్షింపుము రక్షింపుము.

కణ్వ—(విని) ఏమిది యెవరావచ్చువారు (చూచి) ఓహో కౌండిన్యుఁడు భారద్వాజుఁడా వీరిపుడేల వచ్చుచుండిరి.

(అంత కౌండిన్యుఁడు భారద్వాజుఁడు ప్రవేశింతురు.)

(17 అనుబంధము.)

కౌండి—మునివర్య! మునిపల్లెకెంత ఘోరవిపత్తు సంభవించినది.

భార—అయ్యో! ఇఁక నిలువఁదరముగాదు.

కణ్వ—అదేమి మహానులార!

భార—

ఉ॥ కొండబిలంబులన్ మెలఁగు ఘోరమృగంబులఁ బట్టితెచ్చి యు
ద్దండత నాశ్రమంబుల ముందంబున డించినవానిఁగాంచి మా
యండజయానలెల్లరు భయంబునఁ బారఁగఁ గేరదై చి తా
మెండుగ నవ్వుచుండెను సుమీ! తమ ముద్దుకుమారిపట్టియున్ ॥

భరతుండు మాకుజేయు నపకారంబులకు లెక్కలేవు. మీ బాలుండని శాంతితోడనున్నారము గాని వేరుగాదు.

కణ్వ—ఔను మీరు మహానీయులేమి జేయఁజాలరు.

కౌండి—మేము తపోనిష్ఠాగరిష్ఠులమై సమాధియందువేళ సింగంబులఁ బట్టియు, సివంగులఁగొట్టియు, మాతంగంబులఁ బడనెట్టియు, క్రోల్పులులఁ గట్టియు, కురంగంబులఁ దురంగములగా నొనర్చుకొని స్వారిఁజేయుచు బాలకులెదురైన వెఱపించుచు బాలికలెదురైనఁ దూలనాడుచు గోలసేయుచు లెక్కలేక నొక్కఁడై చరించుచున్నవాఁడు దేవ! యిట్టివాఁడున్నఁ దపోవిఘ్నంబు బొసంగెడు వీని నిజపురంబున కనుపుము.

కణ్వ—ఆర్యులార! మీకేమి భయంబు లేదు పొండు.

భార—మంచిది, మాకనుష్ఠానకాలం బాసన్నంబైనది మేముపోయి వత్తుము. (నిష్క్రమింతురు.)

కణ్వ—(తనలో) ఆహా! వీఁడెంతవాఁడయ్యెను. పూర్వమీతని తండ్రి కొండల బంతులుగాఁగొని కందుకకేళి నొనర్చినవాఁడు వీఁతని మించియున్నాఁడు కనుఁగొన వెఱపాదవు మృగయూథంబు

లఁబట్టి విహరించెడు వీనిని నాపుత్రిక శకుంతలను నిజపురిజేరఁ బనిచెద. (ప్రకాశముగా) అమ్మాయీ! శకుంతలా! ఇటురమ్ము.

శకుం—(ప్రవేశించి) ఆదేమిజనకా!

కణ్వ—బిడ్డా! నాపలుకాలింపుము.

సీ॥ ఎట్టికాంతలకైన • నెన్నాళ్లుబుట్టింట
నివసింపరాదమ్మ! • నీరజాక్షి!
భరతునితోఁగూడి • పతికడకేగుట
బాగుగానున్నది • పట్టి! నాకు
దౌష్యంతిఁబొడఁగన • దుష్యంతుమించెను
బలపరాక్రమములఁ • నెలఁతమిన్న
వరనాథుఁడన్నా • నాటనుండియువచ్చి
పోడాయె నెపుడే • పూవుఁబోణి

గీ॥ ఇంతి కరినగరమునకు • సంతసమున
గదలిపోనౌను జక్కని • కాలమిద్ది
నీకుమారుని పట్టాభి • షేకశుభము
గనులపండువుగాఁగాంచి • మనఁగదమ్మ! ।

ఎట్టివరమ పతివ్రతా శిరోమణివైనను బుట్టినింట నుంచుట చితంబుగాదు. నీవును నీకుమారుఁడును నీపతిగృహంబునకేగుడు

శకుం—(తనలో) ఇంతలోనే నింతతొందరపడుట మేలుగాదు గావ వరుసియందు కొంచమసూయతయు మునీంద్రునియందు ప్రేమయు గనపఱచెద. (ప్రకాశముగా) జనకా! నావిభుండు వన్ను మఱచియున్నాఁడే నేనెటుబోదును.

సీ॥ తనకుదానై వేఁట • యనుమిష చేవచ్చి
కాంచినన్నటుల మో • హించినాఁడు
సకలచరాచర • జంతుసంతతిసాక్షి
"నినుబాయ" ననిపల్కఁ • దనరినాఁడు

గాంధర్వవై వాహికంబున నాకరం
బంటిభోగంబులనందినాఁడు
"తరుణివేవచ్చి నాపురిఁ జేరుమిన్న" ని
బొంకి నన్నిడఁబాసిపోయినాఁడు
గీ॥ మాసములు వత్సరంబులు జాసె పతియు
రాడు కన్నులఁ జూడఁడా తేఁడుమఱల
నన్ను గుర్తించి చేపట్టు నన్నమాట
నమ్మకము లేదు నీదు పాదమ్ములాన ॥

కణ్వ—కుమారి! నీవన్నమాటలన్నియు నిజంబేగాని దుష్యంతధరాధిపుఁడుమాత్రము కల్లలాడువాఁడుగాఁడు నిక్కముగానీవు నీపతి కడ కేగవలయు.

శకుం—

ఉ॥ సంతసమాయనయ్య! యిదెచయ్యనఁ బోయెదనయ్య! వారుణీ
కాంతుఁడు బ్రీతిచేసుతుసిగన్నులఁజూచియుఁ గారవించునో
పంతములాడునో బనులు పల్కక నూరక భ్రాంతిఁజెంద న
న్నెంతలుజేయునోగత ముందిది! యెవండపుడో మఁజాలెనుఁ॥

తండ్రి! రాజుగని మమ్మెవరనియడిగిన మేమేమందుము. కేమి వోపకున్నది. కానిమ్మ దైవముగలఁడు.

కణ్వ—అమ్మా! నీపతివ్రతా మహాత్మ్యంబున నాకాశవాణి భూమీశుసభాస్థలి సాక్ష్యమీయఁగలదు బొమ్మ నీవెంటఁ గొందఱు శిష్యులనంపెద వారలు నీకుతోడై వచ్చి నియుదంత మాద్యంతము ట నివేదించెదరు.

శకుం—జనకా! భరతుండెచ్చటికేగెనో రాడయ్యెను (చూచి) అదే వచ్చుచున్నాఁడు. (ఎదురేగి) నాచిన్నియన్న! ఇంతకాల మెందే గియున్నావు. రమ్ము.

అ। వె। నాకుమారరార! నలినలోచన! రార

తండ్రికడకునే(డెం తరలవలయు
తాతసెలవునందిం ప్రీతితోనా వెంట
నేగుదెమ్ము నిలువం నేలనిచట ॥

భర—అమ్మా! మఱచితి నాతండ్రియెవరు
శకుం—కుమార! తండ్రినీదినమె జూపించెదరమ్మా. తాతకు నమస్కరింపుము.
భర—తాతగారు నమస్కరించెద
కణ్వ—చిరకాలసుఖ మనుభవింపుము.
శకుం—నాయన! నమస్కారము
కణ్వ—దీర్ఘసుమంగళీభవ
శకుం—అయ్యా! శిష్యులవెంటనంపు(డు
కణ్వ—కనకాంగ! గుణవంత! యొచ్చట
శిష్య—మునీంద్రా! ఏమిసెలవు.
కణ్వ—మనశకుంతల నత్తవారింట విడచిరండు.
శిష్య—చిత్తము.
శకుం—తండ్రీ! పోయివచ్చెదను (నమస్కరింతురు.)
కణ్వ—అదె మాశకుంతల(బోవుచున్నది, అహా! పుట్టిననాటనుండియు నల్లారుముద్దుగా నరచేతనిడుకొని పెంచితిని. పెద్దదానిజేసితిని, నన్నెడబాసి యొకక్షణకాలమేని నిలువనేరని మాశకుంతల నాబహిఃప్రాణమగు శకుంతల, శకుంతదంపతులచే రక్షింప(బడుతరి గొనివచ్చి కన్నకూతుగా నే(బెంచ( బెఱిగినశకుంతల, కలనైన నామాటమీరని శకుంతల, త్రిలోకవర్ణిత వారాసియగుశకుంతల, మాశకుంతల నాముద్దుతనయ, నన్నెడబాసి పోవుచున్నది. అనయంబీమె పెం(బెంచబడిన లతావితానముల నారయుచున్నది సుందరతరుబృందంబుల వీక్షించుచున్నది. మాశకుంతలచే( బోషింప(బడిన శారికాకీరదంపతుల( దిలకించుచున్న

ను; నాకనుక్షణము దిగులగుచుండెను ఎచ్చోటనో దెచ్చి బెంచిన నాకు తపోధనునకు, జితేంద్రియునకు, పుత్రికనెడబాయువేళ నిట్లుండ నవమాసంబులు మోసిమోసి కని పెంచి చేతులార కన్యాదానమొనర్చిన తలిదండ్రులు కడకత్తగారింటికి కూఁతునంపు నపుఁడెంతచింతం చెదరోగదా? (చూచి) అపుడే నాదృష్టిపథము నతిక్రమించినది. ఇఁక నేనేమనుకొనిన నేమిసార్థకము? అదే మా శకుంతలచే నతిప్రీతి ప్రేమింపఁబడిన కురంగివింసుగర్భిణియై కదలలేక చెవులనిక్కబెట్టి నలుదిక్కులారయుచు తృణాంకురముల నోటనిడక మాశకుంతలకై చింతిల్లుచున్నది. నేఁబోయి యోదార్చెద.

(నిష్క్రమించును.)

ఇది పంచమాంకము.





శ్రీరస్తు.

# చిత్ర శాకుంతల నాటకము

## షష్ఠాంకము.

### 1వ రంగము.

హాస్తినాపురము.

(దుష్యంతుఁడు, సుధర్ముఁడు బ్రవేశింతురు.)

దుష్యం— సుధర్మా! ఆహా నిన్న మనసభాగారమున నాకాంతామణి పాడిన గానమెంత రసవంతముగానున్నది.

సుధ— దేవ! సంగీతము పూర్వపుణ్యముజేతఁగదా లభ్యమగును. దానికాగానకౌశలమట్లు లభ్యమైనది.

సేవ— (ప్రవేశించి) జయము జయము మహారాజా! కణ్వాశ్రమము నుండి యొక్క కాంతయు, నొకపసిబాలుండును, కొందరు విప్రవటువులునువచ్చి దేవరదర్శనార్థమై వేచియున్నారు.

దుష్యం— సత్వరము ప్రవేశపెట్టుము.

సేవ— చిత్తము. (నిష్క్రమించి శకుంతలాభరతులు కణ్వశిష్యులు వెంటరా బ్రవేశించును.)

శాకుం— (18 అనుబంధము)

1 శిష్యు— మహారాజునకు శుభంబగుగాక.

2 శిష్యు— భూవరుం డభివృద్ధినందుగాక.

దుష్య— అయ్యా! మీరెవరు ఇంతదవ్వరుదేర కతంబేమి.

1 శిష్యు— మేము కణ్వశిష్యులము మహామహుఁడగు కణ్వముని మీతోనిట్లు దెలుపుమనియె. "తొల్లి నీవువేటకరుదెంచి మా యాశ్రమమునకేతెంచి మాశకుంతలచే సపర్యలగాంచియామెను

మోహించి గాంధర్వవివాహమున కేళిఁదేలించి మరలవచ్చి నిను గొనిపోయెదనని వచించిచని యింతవరకురానైతివి. ఈయమ నీ వేసిన కతిపయమాసముల కొక్కచక్కని కొమరుఁగనియే నతం డఖండ తేజోనిధియై నిన్నుమించఁజాలి యుండఁగని శకుంతలను భరతుని నీకడకంపినాఁడ నీయమననుగ్రహించి చేఁబట్టఁగోరుచు న్నాఁడ" యనివచించి ఈమెననిపె దేవరవారి శకుంతల ననుగ్రహింపుడు.

దుష్య—ఆర్యా! కణ్వాశ్రమమేఁడ? నేవచ్చుటేఁడ! మీశకుంతలను బెండ్లాడుటేఁడ? చాలుఁజాలు నికమీవాచాలతఁ గట్టిపెట్టి లేనిపో నిందల నెత్తి నిడకుఁడు.

శకుం—(తనలో) ఏమిది ఈతఁడిట్లనుచున్నాఁడు.

కం॥ ఎఱుఁగఁడొకొ? నన్ను, నెఱిఁగియు
నెఱుఁగని యట్లుండునొక్కొ? యెడపవ్వగుటన్
మఱచెనొకొ? మాగ్ధలధిపులు
మఱువరె? బహుకార్యభారమగ్నులుగారె? ॥

నెండియు,

చ॥ తలఁపఁగనాఁడు పల్కిన విధంబెడఁదన్ దలపంగరాదొ? చూ
డ్కులు విరసంబులై కరముఁగ్రూరములైన నిమిత్తమేమొ? కో
కలయఁగఁబల్కరించి యుపకారులునై రని నమ్మియుండఁగా
వలవదు బుద్ధిమంతులు సపాపియులైన ధరాధినాథులన్ ॥

ఐననేనూరకొనుట భావ్యమగునా?

కం॥ మఱచినఁ దలపింపఁగనగు
నెఱుఁగని వాఁడెల్లఁ దాట్ల నెఱుఁగంగనగున్
మఱిమెఱిఁగి యెఱుఁగనొల్లని
గఱటం దెలుపంగఁ గమలగర్భుని వరమే? ॥

నన్నెఱిగియు నెఱుఁగనట్లూరకున్నాఁడు. నాఁడరణ్యమున కే

తెంచి నాతోడఁజేసిన బాసలు, ఆకులుకులు, అతళుకులు, అవలు కు, అవినయము, అవిధేయత, అగాంభీర్య ధైర్యసాహసములు. ఆవిలాసములు, అసత్యనిష్ఠ నేఁడెందుఁబోయినవి నిజముగానీతఁడు దుష్యంతుఁడేగదా? లేక నేను శకుంతలనేగాదా? కాకున్న నీతఁడే లమును చెమ. నన్నేలఁజేరదియుఁడు. తొందరపడనేల కానిమ్ము.

సుధ—విప్రవర! మహారాజుగారి మాటలకేమి ప్రత్యుత్తర మొసం గెదరు.

2 శిష్యు—మమ్మేమొసంగమనెదరు (శకుంతలనుఁజూచి) అమ్మా! సమయము వచ్చినపుడు సిగ్గుపడిన నేమిసార్థకము చల్లకువచ్చిముం తదాచువారుందురా? సముఖానకువచ్చి రాచుభారమా? సర్వర మ నీయుదంతము భూపతితోనుడువుము.

శకుం—(సిగ్గుతో) భూమీశ! అపుడేమరచితిరా? నాఁడులతావితాన ము నల్లబిల్లిగానల్లిన పొదరిల్లున మనమిరువురము కేళిదేలినపిమ్మ ట నీవు విలాసార్థమై పండుదాడిమగింజల చేనిముకొని నాచేఁబో షింపఁబడినఁ ముద్దుచిలుకను జేరఁబిలువ నది రాకున్నతరి నాకా బీజంబులనొసంగి "నీవుబిలువు" మన నేనాకీరమును బిలువ వెం టనే యది నాకడకరుదెంచి దాడిమబీజంబులఁ దినసాగ నీవదిగాం చి కామినీ "బంధువులు బంధువులగౌరవింతురు మీరిరువురరణ్య సంభవులుగదా" యనినుడివి ననుగౌరవించినమాట మరచితిరా?

దుష్య—పోను కాంతలు ప్రియుల వశపరచుకొనువేళ నెన్నిపన్నా గములేని పన్నుదురు. నీవేమి? నేనేఁడి? కీరమేమి? స్వప్నమందైన నెఱుఁగ.

శకు—పోనిమ్ము. నీవాదయందు నాకడకరుదెంచి నన్నుబ్రతిమాలా డ నేను "మాజనకుండు కణ్వమహామునివారువచ్చి నీకిచ్చిన ప రిగ్రహింపుమనివేఁడ నీవందాక నేనుండఁజాల మనసికాక కోర్వ జాల" ననివచించియు సకలరాజ్యములును నాసర్వస్వము నీకు

నాకు బోడము ముద్దుకొట్టుసి కొసంగెద,,నంటరే యేదియొసంగుఁ
డు మీకొమారుఁడే యీతఁడు భరతుండు.

దుష్య—సుశర్మ! ఇదేటిమాట.

చ॥ మునియెట? యాశ్రమంబెచటఁ బోయితివెప్పుడు వేటకేను,నీ
వసితనుఁగంటి; హస్తమునఁ గైకొంటి హస్తము కామకేళిలోఁ
బెనఁగితి రాజ్యసంపదలఁ బ్రేముడి బాలునకిత్తునంటి నా
మనమున నీప్రమాటలను మానముగాఁగనుపట్టుచుండె వెసన్॥

పోనిమ్ము నేనొకవేళ వైవాహికంబాడ నిచ్ఛగించినను మునిక న్యనిచ్ఛగింతునా? అందులో గాంధర్వవైవాహికంబేలఁ బురిఁజేరి వివిధోత్సవంబులఁ బరిణయంబుగారాదా? ఒకవేళఁ దానికే యంగీకరించి కలసితిననుకొనుము వెంటనేగైకొనిరాక యుందుం తునా? ఉంచితిననుకొనుము నాయడఁగల ప్రేమాతిరేకమునఁ దానపుడే రాకుందునా? అయ్యారే! ఈకాంతపలుకులత్యంతదూషితములై గనుపట్టెను నమ్ముటకువీలులేదు.

సుశ—దేవ! ఆయమ నుడివిన నుడువులు స్వభావసిద్ధమై యనుభవైకవేద్యములై మృదుమధుర గాంభీర్యములై గనుపట్టెను తప్పక నమ్మవచ్చునని నాయభిప్రాయము పిమ్మట దేవరవారిచిత్తము

శకు—ప్రాణపతి! "పౌరవు లసత్యమాడ" రంటివే యిదియేనా మీ సత్యము.

ఉ॥ న్యాయముగాదు నన్నిటులనారయకే పురికేగుమంట; స్వ
శ్రేయముగాదు కల్లలనుజెప్పిన నమ్మిన కొమ్మపొందు న
న్యాయముగాదు నీకొమరుఁబోటనువీని పరాయివానిగాఁ
ద్రోయఁగరాదు నెమ్మది కుతూహలముల్ విడరాదు భూవరా?

దుష్య—చాలుచాలు నీవు బ్రాహ్మణకన్యవు నేను క్షత్రియుడను నీకు నాకెక్కడి సాంగత్యము పోపొమ్ము.

శ-మనోహర! నేనంతయు బూర్వమేనుడివితినైనను మరల నాలింపుము

క౦॥ క్షత్రియఋషియగు విశ్వా
మిత్రునకు బవిత్రమైన మేనకకుఁ జ
త్పుత్రినయి బొంకుబలుకఁగ
ధాత్రీతలనాథ! యంత ధర్మేతరనే? ॥

రాజఋషి విశ్వామిత్రుఁడు నన్నుఁగనియె కణ్వాశ్రమంబునఁ బెట్టెపోతి నిన్ను వరించితి. నీకుమారుని గాంచితిని ఇందపత్య మావగింజంతేసి గానుపింపదు.

దుష్య — పలుకులకేమి పాణోష్టము. కామినీజన మసత్యమునకు జన్మభూములు.

సీ॥ మగఁడెంతవాఁడైన నగిగేలిగొట్టుచు
వాదులాడుట యాఁడవారిసొమ్ము
పరువుపెద్దల నరయక నెంతటి
వారిఁగొనటాడ వారిసొమ్ము
అనృతంబు బంతిఫేదాచారహీనత
వాచాలతయు నాఁడవారిసొమ్ము
పతినిజావఁగఁగొట్టి బావికో గోఁతికో
పరువులెత్తుట యాఁడవారిసొమ్ము
గీ॥ తరుణి రసనాగ్రమునఁ జేనె గురియు హృదయ
సీమ ఘోరవిషాగ్ని వసించియుండు
ధరణి పురుషులపాలి కత్తెలఁబోలు
కొమ్మవలపులు కుందేటికొమ్ములబల! ॥

చాలును "ఒక్కపొద్దే లేదన నొకదాసరికైనబొట్టు" మనినట్లు నిన్ను నేనెరుగను జూడలేదన లేనిపోనివరసలఁ గల్పించి మాటలాడెదవు మానినీ! పెరచానవై దిట్టతనమున గుట్టువిడి యిట్టిరాజసభఁ బలుకఁదగదు పొమ్ము.

శకు — భూపాల! నాలాపమేమి.

సీ॥ పరిజనంబాలించు భూపతివరేణ్యులు మీరు
కల్లలనాడుటఁ జెల్లునయ్య!

దు — కల్లయేమున్నది? కణ్వాశ్రమముగాని
నినుగాని యెఱుఁగనో నీరజాక్షి!

శకు — యెఱిఁగియే యిటులన నేమివచింతునీ
తనయుని మోమైన గనఁగదయ్య!

దు — తనయుఁడెవ్వఁడు; నేను జనకుండఁగాను ని
ష్ఠూర్యంబులాడఁగఁ జూడకబల!

శకు — గీ॥ నమ్మవచ్చినదాన నిక్కమ్ము నీదు
దాసురాలను నమవీడఁ దలఁపకయ్య!

దుష్య — పరధన పరాంగనల కాశపడనివాఁడ
పొమ్ము నీకిరమంటనో పూవుఁబోఁడి! ॥

శకు — ప్రాణపతీ! ఏలయిట్లాడెదవు.

సీ॥ అన్వయస్థితులకు నాదిభూతంబెన్న
భార్యగాకన్యులే మార్యవర్య!
ధర్మార్థకామవర్ధన మొనరింపు వో
భార్యగాకన్యులే ప్రాణనాథ!
పుత్రసంతాన సంపూర్ణభోగంబిడ
భార్యగాకన్యులే వసుమతీశ!
పతిఖేదమును బాపి హితవును బోధింప
భార్యగాకన్యులే శౌర్యధుర్య!
గీ॥ మాఱిదిగువానిచేతిలో మాతభార్య
చీకటింటికి దీపమై వెలఁగుభార్య
అన్నిటికిని మూలకారణం బగును భార్య
భార్యలేకున్నవాఁడు దౌర్భాగ్యుఁడరయ ॥

మఱియు భార్య పురుషున కర్ధశరీరంబగుటఁ జేసి పురుషునకు

మున్ను వరేతయైనఁ బతివ్రతపరలోకంబునం దనపురుషునిగూడఁద దాగమనంబుబ్రతీక్షించుచుండు బురుషుండు మున్నుబరేతుండైనఁ బదంపడి దానును పరేతయై తనపురుషుంగూడనగునట్టి భార్యనవమానించుట యధర్మంబు; మఱియు నప్పురుషుండు భార్యయందు బ్రవేశించి గర్భంబునఁ బుత్రుండై దానుద్భవిల్లు. గావున "ఆత్మా వై పుత్రనామాసి" యనునది యాదిగాఁగల వేద వచనంబులయందు జనకుండును బుత్రుండునను భేదంబు లేదు. గాన తావక శృంగార దేహవల్లికకు బొడమిన నీతనయు కుసుమమును గారవింపుము, దీవింపుము, కరుణింపుము, నీకుమారుండిదే యన్నివిధముల నిన్నుబోలియున్నాఁడు.

కం॥ బాలార్క తేజుఁడగు నీ
బాలుఁడు నీకొడుకువీని పౌరవకుల ర
త్నాలంకారు నుదారగు
ణాలయ! యువరాజుఁజేయు మభిషేకము తో ॥

దుష్య—కామినీ! ఏలయింత మొండివాదమునకు గడంగెదవు.

గీ॥ పోలతి లోకంబునను బర పురుషుఁగలసి
కొమరుఁగని నాకుబుట్టిన కొమరటంచు
నమ్మకము బుట్టఁబలికెదు న్యాయమౌనె
కాంత లెంతటి గయ్యాళి గంపలరయ ॥

అతివా! ఈయధికప్రసంగమును గట్టిపెట్టి తొలఁగిపొమ్ము. నీమొగముజూడను.

శకు—భూపతి! ఎంతయసత్యమునకు లోఁబడితివి నాతోడిబొందుతరి నెవరులేరని తలంచితివి కాఁబోలు.

దుష్య—ఔను నీతోఁగలయుతరి నెవరుసాక్షి యొక్కసాక్షియేనిగలదా వెలువంచి వచింపుము.

శకు—(తనలో) హా దైవమా! ఇఁకేమి సేయుదాన నైన యిట్లనుచి వెద. (ప్రకాశముగా) ఆర్య! ఆలింపుము.

సీ॥ పదునాల్గులోకముల్ పరిపాలన మొనర్చు
చుండెడు పరమేశ్వ రుండు సాక్షి
అవని నంత యురాత్రి బవలుజరించెడు
ధన్యులౌ సూర్యచం ద్రములు సాక్షి
పగ లెల్లఁ దమ కాంతి నగపడనీయక
వెలుగందు తారకా వళియె సాక్షి
నీకు నాకును బ్రేమఁ జేకూరఁగాఁ జేసి
కలపినట్టియ్య వి ల్లాఁడు సాక్షి
గీ॥ అష్టదిక్కులు సాక్షి నా యాత్మ సాక్షి
హరిహర బ్రహ్మలోక సాక్షి యవని సాక్షి
అంబుధులు సాక్షి సుర విక రంబు సాక్షి
వేరె సాక్షులికేలనో ధారుణీశ! ॥

భర—జనకా! ఎంతటి కఠిన హృదయుడవు. (20 అనుబంధము.)

గీ॥ అమ్మ యిన్ని తెన్నులడిగినకరుణింప
కేమొ మాటలాడ వెం చెదరకట
తాతగారిమాట దలఁపోకు నిక్కము
నాదుజనకుఁడీవె! నరవరేణ్య! ॥

శకు—ఓ ఆకాశవాణీ! నేనును నీ భూవరుండును గలసి మెలసి యుండు తరి నీవు తప్ప తక్కొవరు లెరుంగరు. తల్లీ! ఇతండు నేఁడంతయు నెఱుఁగననుచుండె, నాయందనుగ్రహముంచి సత్యమో యసత్యమో సభాభవనంబున నెల్లవారాలింప వచింపుము.

(తెఱలో)

ఓ రాజకులాగ్రణీ! దుష్యంత మహీపాల! నా పలుకాలకింపుము.

చ॥ గొనకొని వీఁడునీకును శకుంతలకున్ బ్రియనందనుండు జే
కొని భరియింపుమీతని శకుంతలసత్యము బల్కె సాధ్వి స
ద్వినుత మహాపతివ్రత వివేకచరిత్ర గుణామయాంబుధిన్
వినుము ధరాధినాథ! కనుపించదసత్య మొకింతదీనిలోన్ ।

సుధ—ఆహా! ఏమది ఇట్లెల్లవారలకు నతిహర్షంబుగా శకుంతల పతివ్రతాప్రభావంబును భరతోత్పత్తియు బ్రశంసించు వేలుపుల పలుకులతి వ్యక్తంబులై యాకాశవాణివలన పితెంచె వింటివా? భూమిధవా! యింక సంశయంబేమి?

దుష్య—సభాసదులార!

సీ॥ అన్యులెఱుఁగమి జేసి లోకాపవాద
భీతినెఱిఁగియు నీకన్వి బ్రీతిఁదప్పి
యెఱుఁగనంటిని సందరికెప్పుడెఱుఁగఁ
జెప్పనాకాశవాణి యుచ్చైరువుగాఁగ ।

నేనాకతరి వేఁటకేగి కణ్వాశ్రమంబున బాలశశిరేఖఁ బోలె భాసిల్లు నీబాలికఁగని మోహించితి. నపుడీయతివ యంగీకరింపక నాకునీకుఁబొడము సుకుమారునికి నీసర్వరాజ్య మొసంగుఁడనివేడఁ నేనంగీకరించితి. అంతదీనితోఁగూడి సకలభోగంబులంద మరల వచ్చెదనని వీడివచ్చితి. నిపుడీయతివ నాకడకరుదెంచి పలికినపలుకులు నిక్కము. నేనింతదనుక పలికినపలుకు లసత్యము.
(భరతునిజూచి)

గీ॥ బాల! సుకుమారగాత్ర! నాపట్టిరార!
తనయ! నాతలిభాగ్య రత్నంబరార!
మన్మథాకార రార! కుమార రార!
జనకుఁడను నేను కొడుక! సంశయమదేల? ॥

(భరతునెత్తుకొని) తనయా! నీవనినట్లింతయు నేకతనహృద

యుండను.. లేకున్న నిన్నాదరసి గారవించి చేరఁదీయనా! దేవీ! శ కుంతల! లోకాపవాదభీతి నిన్నుగారవింపక యాదరమున్న నన్ను క్షమింపుము.

శకు—(కౌఁగలించుకొని) నాథ! నేక్షమింప మీ నేరమేమున్నది. నేఁడ నంధ్యరాలను మరల మీరు గాఢాలింగనసౌఖ్య మందితిని.

దుష్య—సుధర్మ! యింక కర్తవ్య మూహింపుము.

సుధ—దేవ! కుమార సామ్రాజ్యపట్టాభిషేకము గావలయు.

దుష్య—ఇదే సుముహూర్తము తనయా! నిసింహాసనం బధిష్టింపుము (కూర్చుండబెట్టి)

గీ॥ పౌరవృలచేత పాలింపఁబడినధాత్రి
సకలధర్మప్రవర్తివై సాధుజనుల
సన్నుతులఁగాంచి పాలింపఁ సాగుమా కు
మారరత్నము! యాచంద్రతారకముగ ।

అందరు—తథాస్తు. తథాస్తు. (కరతాళధ్వనులజేయుదురు.)

దుష్య—సచివర! ఇంకేమిగావలయు. నైనయిటులగుగాక.

గీ॥ స్వస్తియగుగాక బ్రాహ్మణసంఘములకు
ప్రజసమస్త సుఖంబులఁబడయుగాక
నెలకు మూడేసివానలు నెగఁడుగాక
యవనిచక్రగ నభివృద్ధి నందుగాక ।

అందరు—తథాస్తు.

(నిష్క్రమింతురు.)

ఇది షష్ఠాంకము.

సమాప్తము.



# ఈ నాటకమునందలి అనుబంధములుగా నుంచబడిన కీర్తనలు.

---

### 1. కీర్తన.

నారాయణ వాసుదేవ నిను నమ్మితి మహానుభావ ।
నాభావమున గనుఁగొనరావా నా కాధారుఁడవీవె కావ ॥ నా ॥
కరివరదా రారమ్మి నేశరణంటిని యేలుకొమ్మి ।
నిరతము నీవాఁడసుమ్మి నీ దాసుఁడను చేకొమ్మి ॥ నా ॥

### 2. కీర్తన.—సూత్రధారుఁడు.

రఘుచంద్రా! రఘుచంద్రా! నినుమది నెరనమ్మితి
హితవుగ బ్రోవుము ఓఓఓఓ గుణసాంద్రా !
పలుమారు వేఁడితినిరారా పరిపూర్ణుండవు నీవెరా !
ఈ పండితుల రంజింపనేర! పలుమరు వేఁడితి పరిపూర్ణుండవు
ఓ ఓ ఓ ఓ గుణసాంద్రా ! ॥ రఘు ॥

### 3. కీర్తన.

నటి—ఏటికార్య మేటిశౌర్య మేటికినన్నింత వేగమెరమ్మనుట॥
సూత్ర—ఔచానసేఁను నాటకంబు నాఁడఁగావలెఁ
బాల ! విబుధజనం బరుగుదెంచి యున్నవారలు
ఔచానా! బిరాన వీరలనూ గనుఁగొనుమా ॥
నటి—మనమునందు ఘనముగాను అనుమానంబదేలను
నినువేఁడెద వేగమె నీకేమంత లేదుగా ॥ ఏటి ॥

### 4. కీర్తన.

బృహ—నాకేంద్ర! గుణసాంద్ర! వరకరుణాసాంద్ర! యింద్ర! నెమ్మన
ముందుఁ సమ్మతిలేకఁ సుమ్మ యీరీతిఁ చోద్యంబగును.
ఇంద్ర—తీర్చెదవా! వగతీర్చెదవా! చేకూర్చెదవా! కడతేర్చెదవా !
బృ—ఏమలివింత నేనదిగాంతు నాదగుచెంత వినుపింపుమంత ॥

ఇం-గాధేయుఁడటా కాంతారమటా తానిగెనటా తపముజేసెనట ॥నా॥

5. కీర్తన.—మేనక.

హాయిహాస్వర్గాధిరాజ నీకిదేజోహార్ హాయ్ ॥
నిరతము నీదానురాలను నాపయిఁగా దయఁజూడు ॥ హాయ్ ॥
అనుదినంబును నిన్నునమ్మితి నన్నుబ్రోవుము రాజ ॥ హాయ్ ॥
విమలమతిలో వేఁడుచుంటిని వేగ మీకృపఁజూడుహాయ్‌హాయ్ హాయి॥

6. కీర్తనలు —డాన్సు వేశ్యలు.

శచీపతి అమరపతి విమలమతి వేఁడితి
వేఁడితిమి పాడితిమి గూడితిమి ఆడితిమి
వేడితిమి పాడితిమి కూడితిమి ఆడితిమి వేగబ్రోవుమా వేశ్యలఁ ॥ శచీ॥

7. కీర్తన.

(నాదుమోహన) మాదిరి.

ఇం—నాట్యకాంతరో శృంగారకాంతరో నామా టలాలించు కాంతరో॥
మహారణ్యమున ఖహాగుహాలోన గాధేయున్నాడు కాంతరో॥
మేన—కాననమందున గాధేయుఁడుంటేను వన్నాబిలదిన పని
నాకుదెల్పుమా॥
ఇం—కాంతా ఓకాంతా! మునిచెంతా చనివింతా గతో డెమ్ము॥ నా॥

8. కీర్తన.—మేనక.

శాంతాకార సుజనమందార శాంతమూర్తివనుచు నీకు
శరణుజేసితి అంతరంగమందునవే నెంతగా వేఁడితి
చింతదీర్చవేలర శ్రీమనోహర! కరుణాభరణ జలజచరణ
తరుణమిదేర విమలమతిని వేఁడితిర వేగ మొబ్రోవవేరా
కమలనయన కలుషహరణ కావనేర॥ శాంతా ॥

9. కీర్తన.

విశ్వా—మగువరో నామాటవినవే ఓమగువరో॥ నా ॥
ఇదివినవే మనిఁగనవే చేకొనవే యిటురావే॥
మేన—హేమునివర్యా! నీకివిమర్యాదగునా యిటుచేయతగదు

తగదు పొమ్మి ॥
విశ్వా—తాళలేనుకొమ్మా
మేన—దరికిరాకుసుమ్మీ తప్పుగాదయా
విశ్వా—ఇందువదన! మందయాన! వందనముగొనవే
మేన—అనుదినమును శ్రీనాథునిదలంచుచు ననుగోరగ నీకగునా?
నీకగునా? యిటుతగునా? ఘనమగునా? న్యాయముగునా? ము॥

10. కీర్తన.—విశ్వామిత్రుడు

యేదయా నీదయా ఓదయాంబోనిధే ।
గాధిపుత్రుండనై కాననంబులందునీ జనుతపంబు చేసియును
కడకు వ్యర్థమాయెనుగా॥ యె ॥
చింతించినపలమేమి శీఘ్రముగానీబాలశ
కుంతి దంపతుల చెంతనుంచినే నరిగెద వేగమె॥ యే ।

11. కీర్తన.—సేవకుడు.

అంతదాన్ని కొట్టితిరాజా నేనింతదాన్ని పట్టితిరాజ ।
పెద్దమృగాన్ని కొట్టితిరాజా దానిపేరుదెల్దు మహారాజా ॥ అం ॥
శరభాన్ని కొట్టితిరాజ పెద్దసింహాన్నిపట్టితిరాజ
అరమరలేకనురాజా హరికొంబుసేస్తి మహారాజా ॥ అం ॥
బాగాంబువేసేవరకు సింహనాదంబుజే నాకొరకు
అదిప్రాణంబువిడిచెను తుదకు నేపూనితెస్తి నీకడకు ॥ అం ॥

12. కీర్తన —దుష్యంతుడు.

దు— ఇందువదన! కుందరదన! మందయాన! రావే
శకు—అందరాని ఫలముగోరచెందునా నీకు
దు— మానినితడవేలనే మరుండు తూపులువేసెనే
శకు—వలదువలదు నాతో వాదమెల్లపోపో
దు— వాదమేల బాల! వరుసతో రావేలా
శకు—నీవిథమున నీవనిన నీకెవ్వరు తెల్పెదరు
దు— సావధానముగను నల్పెదమకార్యము॥

13. కీర్తన.

శకుం—ధరిపతివై పరసతినిఁ సరసముతో బరసలదూరఁగనౌనా?
దుష్య—ముషులకుమారి మోహనకారి గనుఁగొనుమరుబారి
శకుం—ఔర్వాసివౌరా యేమివింతవేఁడుట నీవరయఁగగుణధామ
ఛీనీతివంతుఁడ నీవిటునిలచితి వన్నాదరమున బల్క
తగదకపోరా తాళుమధిరా ॥
దుష్య—నిలుపఁగలేనే వలపునునీపై ॥

14. కీర్తన.

దుష్య—మానితరాజ స్మరసతితేజ పోదగునే యిటులన్
శకుం—తపయుక బడయక జనుట జనుటన్
దుష్య—కూడఁగనమ్మ కులుకుఁబొమ్మా వేడుకలయ్యెఁగదా॥

15. కీర్తన

దుష్య—మనవినివినుబాలికా మానకనీతోఁ బలికెదనిటునావే
కలికీ చిలుకలకొలికీ మన్మథు ములికీ పలుకఁగదే॥ మ ॥
శకుం—హేవరకాంతామణుల పావమనకను వరియింపఁ దగునే
మనువనేల ధరణిపాల ధర్మములను దెలిసికొనుము ॥
దుష్య—కాంతా నాదుచెంత నిలువుమింత సంతసంబుమీరఁ !

16. కీర్తన.

దుష్య—కాంత ఇంతనీకు కఠినమేల నామీఁద
శకుం—కఠినమేల నీతోనాకు కరిపురీశపోపో
దుష్య—మదవతినాతో మరిమరిబల్కక మరుకేళికియిఁ బరమ్మ
ఇటురమ్మ మద్దిమ్మా చేకొమ్మ రారమ్మవేఁగ॥ కాం ॥
శకుం—తడయక బడయక పుడమీశుడ పెరపడతులనీరీతిని
బల్కుట తగదికనూ వలదికను లేలేమ్మ పోపొమ్మ ॥

17. కీర్తన.

మునులు-ఓ [illegible]! సుగుణసాంద్రా! మీపట్టచేతలు మేము
[illegible]

కణ్వ—హే మిత్రులారా! యేమిచేసవేగ దెల్పుడీ
చాలఆత్రముతో వచ్చిన మీచందమరయగా హేమిత్ర
ప్రియమిత్రా ఏంతమాత్రము వగపు జెందకుడీ॥
మును—పొందరాని బాధలను పొందుచున్నాము దేవ
పొందుగాను మీకు మేము వందనంబు జేతుమో ॥ ఓము॥

18. కీర్తన.—శకుంతల.

ఈపురంబై భవ మింతింతనుచును యెన్నదరముగాదాహాహా
భరత! అహాహా భరత! అహాహా! భరత అహాహా! భరత! హా
కోటలు సేటలు తోటలు పాటలు నీటుగవినగా భరత
జూడ హాటకనిర్మితము వినంగ గనంగ జనంగ యెంతో వింత
లాయెగా॥ ఈపుర॥

19. కీర్తన.

శకు—రాగదే నన్నుబ్రోవ రాక్షససంహారక॥ రా॥
నాజనకుడు నీసంగతి నాద్యంతముమినియే నను నో
కావలెరక్షకా కలుషసంహారకా కామజనక కరుణయుంచు
కరివరదా కపటమేల అరమరయేర బిరబిరరార
అలస్యముజేయుక యేర ధీర రార మేర యేలుకోర రాగదే

20. కీర్తన.—భరతుండు.

భర—నాన్న వినుమా! హానన్నుగనుమా నావిన్నపంబును వినుమా ।
మాతల్లిగన మహాతల్లపిల్లె చెల్లునె నీకు నాన్న ॥
దు—డింభక! నీయొక్క గాంభీర్యవాక్యంబు జంభారికైననుగలదా॥
శకు—నాథ! భూనాథ! నన్నాదరింపరాదా ॥

21. కీర్తన.

కరుణాలవాల కాంచనచేలా భూమిజపాలా పొగడితిచాలా ।
కరుణగనుమ మొరవినుమా కమలనయన కలుషహరణ
దరిజేరితి నినువేడితి పరిపరివిధముల గొనియాడితి
శ్రీలోలా ఖూలీలా రావేల జాగేల॥ కరు॥

22. కీర్తన.

దీనదయాపర దివ్యగుణాకర! భావజకారా భవ్యవిచార
మానితధీరా మహితవిహార శ్యామలకారా శత్రుసంహార ॥
హా యదుకులకలశాంబుధిచంద్ర! సద్గుణసాంద్ర పావనకార
పర్వతోద్ధార మాధవా! వీర! బ్రోవనురారా॥ దీన ॥

23. కీర్తన.

కరీంద్రవరద! బ్రోవరా! కరుణతోడవేగమే
బిరానగావవేమిర! మొరాలకించి శీఘ్రమే ॥
నందునివరపుత్ర! నిన్నునమ్మియుంటిరా
సందియంబులేకనా డెంక్ల రామయాఖ్యుని॥ కరీంద్ర॥

24. కీర్తన.

అనాదిపురుషా యనంగజనకా సనాతనాభవ విమోచన
అనాథపోషక మునీంద్రసన్నుత సరోజనేత్రవర బ్రోవరా॥ అ॥
కరీంద్రపాలక సురేంద్రవందిత పరాత్పరా భవనాశన
మురారిమర్దన బిరానవేడితి వరంబులొసగుము కేశవ॥ అనాది॥

25. కీర్తన.

శ్రీరఘురామ శ్రితదివ్యకామ! పావననామ భవతుమంగళం ॥
నేరమదేం కారుణ్యధీర! భారమదేర సరగునరార॥ శ్రీ॥
నీలకంఠనుత నిన్నువేడితిర చాలగొలచితిర సర్పశయనవిశా
లాలంబా యేలనునీ పాలబడితిగోను భవ్యమంగళం। శ్రీ॥
నాడెండ్లాన్వయ రామమూర్తిని యాదరించిన శ్రీధరగోనుమహా
శ్రీదమునీకేలనురా మోదముతోగోను భవతుమంగళం॥ శ్రీరఘు।
(21-22-23-24 కీర్తనలు పాత్రోచితముగా పాడుకొనవలయును.)

విజయముద్రాక్షరశాల, బాపట్ల.